**మూలం: http://kottapalli.in/2012/06/welcome**

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'టెక్కలి బడి':** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి - 515 101, అనంతపురం జిల్లా.

ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in




# విషయ సూచిక

# నూట యాభై వసంతాలు

శ్రీకాకుళం జిల్లాలో టెక్కలి అనే ఊరు ఒకటి ఉన్నది. ఆ ఊళ్ళో ఒక బడి ఉంది.

ఏనాడో అక్కడి రాజుగారు మొదలుపెట్టించారు దాన్ని- దానికి కావలసిన నిధులు వగైరాలు సమకూర్చి, అధ్యాపకుల్ని నియమించి, చాలామందికి చదువు చెప్పించారు.

ఆ తర్వాత రాజుగారి వారసులు నడిపించి ఉంటారు దాన్ని- అది నిరంతరంగా, ఆగకుండా నడిచేట్లు చూసేందుకు ఎవరు ఏమేం జాగ్రత్తలు తీసుకున్నారో, మరి- అట్లా ఆ బళ్ళో ఇంకా చాలామంది చదువుకున్నారు.

ఆ తర్వాత చాలా ఏళ్ళకి, మనకి స్వాతంత్ర్యం వచ్చాక, దాని నిర్వహణ బాధ్యతను ప్రభుత్వం తీసుకున్నది. రాజుగారి బడి "ప్రభుత్వ ఉన్నత పాఠశాల" అయ్యింది. అట్లా ఇంకా చాలా మందికి బడి అందుబాటులోకి వచ్చింది. వేలాది మంది పిల్లలు ఆ బళ్ళో చదువుకొని పెద్దవాళ్లయ్యారు. వందలాది మంది ఆ బళ్ళో పాఠాలు చెప్పారు.

150 సంవత్సరాల చరిత్ర ఉన్న ఆ బడి ఈనాటికీ చిన్నబోలేదు! అక్కడి టీచర్లు పాఠాలు చెప్పీ చెప్పీ అలసిపోలేదు. "మాకెందుకులే, ఈ చదువుల సంగతి- మా జీతాలు మాకు అందుతున్నాయి" అనుకోలేదు. "పిల్లలకి ఇంకా బాగా నేర్పించేదెలాగ?" అని వెతుకుతూనే పోయారు. వాళ్ళకి ఆటలు నేర్పించారు, పాటలు నేర్పించారు, కథలు చెప్పారు, కొత్తపల్లినీ పరిచయం చేశారు, వాళ్ళ చేత కథలు రాయించారు- అలా పిల్లలకి చదువు పట్ల, భాషపట్ల ఇష్టం పెంచారు. "మా పిల్లల కథలు, మేం రాసిన కథలు, పిల్లలు వేసిన బొమ్మలు అన్నీ ఎంపిక చేసి అన్నీ ఒక సంచికకు సరిపడా పంపిస్తాం- ఒక్కసారిగా అచ్చువేస్తారా?" అని అడిగారు.

కొత్తపల్లికి ఇది కొత్త. కొంచెం ఆలోచించాల్సి వచ్చింది. అయినా నూట యాభై సంవత్సరాల

టెక్కలి బడి ఇంకా శైశవ గీతులు పాడుతూనే ఉందని సంతోషం వేసింది. ఆ బడిని అందరికీ పరిచయం చేయాలనిపించింది. అలా ఈ జూన్ మాసపు కొత్తపల్లి "టెక్కలి ప్రభుత్వోన్నత పాఠశాల ప్రత్యేక సంచిక"గా మీ ముందుకొచ్చింది.

ఈ సంచికలో కథలన్నీ టెక్కలి సొంతమే. బొమ్మలు కూడా టెక్కలి కళాకారులవే. జోకులు, కవితలు, పొడుపు కథలు కూడా టెక్కలివే. వీటికి స్థానం కల్పించటం కోసం ప్రతిసారీ కొత్తపల్లిలో మామూలుగా ఉండే అంశాలు కొన్నిటిని తగ్గించుకోవాల్సి వచ్చింది. అయితేనేమి, ఇవన్నీ మాకు నచ్చాయి; మీకూ నచ్చుతాయని మా నమ్మకం.

టెక్కలి బడికి నూటయాభై వసంత సుమమాలలు! అధ్యాపక వర్గానికి జోహార్లు! బాల రచయితలకు అభినందనలు! ఇంత అందమైన బొమ్మలు వేసి ఇచ్చిన చిత్రకారులు శ్రీ డబ్బీరు ధర్మారావు గారికి, వి.అప్పలనాయుడు గారికి, బాల చిత్రకారులు సోమేశ్వరరావు, శాతవాహన, చందూ చరణ్‌లకు మప్పితాలు! మరి మీరంతా చాలామంది ఈ నెలలోనే పై తరగతులకు వెళ్తారుగా, అందుకని మీకూ శుభాకాంక్షలు!

-కొత్తపల్లి బృందం.


"ప్రపంచాగ్నికో సమిధ"


"వృక్షదీపం"


"సంఘటిత శక్తి"

*చిత్రాలు: యం.ఉపేంద్ర, 8వ తరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*




# పేపర్ బోయ్



*చంద్రశేఖర్ పండా, 9 వతరగతి E, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*

నేను 6 వతరగతిలో ఉన్నప్పుడు, మా ఇంట్లో చాలా సమస్యలుండేవి. మా నాన్న గారికి నెలకి వెయ్యి రూపాయల జీతం వచ్చేది. మా అమ్మ కూలికి వెళ్ళి కష్టపడి రోజుకి నలభై, యాభై రూపాయల వరకు తెచ్చేది. కానీ వాళ్ళ సంపాదన మా అవసరాలకు ఏమాత్రం సరిపోయేది కాదు. నేను మా అమ్మతో అనేవాడిని- "అమ్మా! మనం ఇంత కష్టాలలో ఉన్నాం కదా- నువ్వు కూడా అంతగా పని చేయలేకపోతున్నావు; నాన్న జీతం చూస్తే- ఎంత పని చేసినా వచ్చేది ఆ వెయ్యి రూపాయలు మాత్రమే. అందుకని నేను చదువు మానేస్తానులేమ్మా! ఎక్కడో ఒక దగ్గర పనిచేస్తానమ్మా!" అని.

మా అమ్మ ఒప్పుకునేది కాదు- "నీకు పనిచేసే వయసు ఇంకా వుందిలేరా! ఇప్పుడు

చదువుకో" అనేది.

అట్లా రోజులు గడిచాయి. ఒకసారి అక్టోబరు నెలలో ఎందుకనో నేను ఉదయం నాలుగు గంటలప్పుడు లేచాను. ఇంటి వాకిలి నుండి బయటకు వచ్చేసరికి ఒక అబ్బాయి పేపరు వేస్తూ కనబడ్డాడు. నేను అతన్నే గమనిస్తూ నిల్చున్నాను చాలా సేపు. అతను ఇల్లిల్లూ తిరిగి పేపర్ వేస్తుంటే నా మనసులో ఏవేవో ఆలోచనలు వచ్చాయి. కొంతసేపటికి నేను ఆ అబ్బాయి దగ్గరికి వెళ్ళి "అన్నయ్యా, నేనూ పేపరు వేస్తాను. నన్ను కూడా పేపర్‌లో చేరిపించవా" అని అడిగాను. "సరే, రా తమ్ముడూ! రేపు ఉదయం నాలుగు గంటలకు రా. నిన్ను నేను పేపరులో చేర్పిస్తాను" అన్నాడు అతను.

అయితే మరునాడు ఉదయం నేను అతన్ని కలిస్తే "ఇప్పుడేమీ పని లేదు- నువ్వు నన్ను నవంబర్‌లో కలువురా తమ్ముడూ" అన్నాడు.

నేను వెళ్ళి మా అమ్మానాన్నలకు ఈ విషయం చెప్పాను. మా నాన్న ఏమీ అనలేదు- కానీ మా అమ్మ మటుకు "ఒద్దులేరా, వేకువ జామున లేవాలి, చలిలో తిరగాలి- కాబట్టి నువ్వు వెళ్ళొద్దులేరా" అన్నది. అయితే నేను మా అమ్మను ఎలాగో ఒప్పించాను. నవంబర్‌లో పేపర్‌లో చేరాను.

ఇక నేను పేపర్ వేసిన కథ మొదలు.

**చలికాలం:**

నేను ముందే చెప్పాను కదా, అది నవంబరు నెల అని?! మీ కందరికీ తెలిసే ఉంటుంది- నవంబరంటే చలికాలం. నేను ముందు పేపర్‌లో చేరినప్పుడు నాకు ఎంతో సరదాగా వుండేది. కాని కొన్ని రోజులు గడిచాక, డిసెంబర్ వచ్చేటప్పటికి నాకు కష్టమంటే ఏమిటో తెలిసింది. ఎలాగంటే- ఆ చలిలో- తెల్లవారు జామున నాలుగు గంటలప్పుడు వెళ్తుంటే నా ఒంటికి ఎంత చలి తగిలేదో చెప్పలేను. ఒక్కొక్కసారి పేపర్లను సైకిల్ వెనక కట్టేటప్పుడు అవి జారి పడిపోయేవి- చలి రోజులు కదా, చేతులు-వేళ్ళు సహకరించేవి కావు. ఆ పేపర్‌లను ఎత్తి తీసి ఇంకొంత దూరం వెళ్ళేటప్పటికి సైకిల్‌చైన్ జారిపోయేది. మళ్ళీ చైన్ వేసుకునేటప్పటికి చాలా ఆలస్యం

అయిపోయేది. అట్లా తంటాలు పడి ఎలాగో ఒకలాగా నేను పేపరును తీసుకు వెళ్ళేసరికి బాగా ఆలస్యం అయిపోయేది. కొంతమంది నా ముఖం చూసి జాలిపడి నన్ను ఏమీ అనేవాళ్ళు కాదు. కానీ కొంతమంది ఎంతచెప్పినా వినకుండా నన్ను నానా రకాలుగా తిట్టేవాళ్ళు. కానీ వాటన్నిటిని భరించుకొని పేపరు వేస్తూనే ఉండేవాడిని.

ఒక్కొక్కసారి పేపరు జీపు ఆలస్యంగా వచ్చేది. అందులో నా ప్రమేయం ఏముంటుంది? ఇక నేను హడావిడిగా ఆ పేపర్లన్నీ సర్ది తీసుకొని వెళ్ళేటప్పటికి కొంతమంది నా మీదికే వచ్చేవాళ్ళు- కొట్టేందుకు! అందులోనూ పల్లెటూరు వాళ్ళు పొద్దునే తొందరగా లేస్తారు కదా; పల్లెటూరు వాళ్ళకి పేపర్ ఆలస్యంగా తీసుకు వెళ్ళామంటే వాళ్ళు పట్టణాల వాళ్ళ కంటే ఘోరంగా తిడతారు.

**ఎండాకాలం:**

చలికాలం తరువాత ఎండాకాలం వస్తుంది గదా. చలికాలం చలి సమస్య అయితే, ఇప్పుడు వేరే సమస్య.. ఎండాకాలం తొందరగా తెల్లవారి పోయే సమస్య. 5 గంటలకే తెల్లవారిపోయేది; అందరూ వేగంగా నిద్ర లేచిపోతారు. కానీ పేపరు జీపు ఎప్పటిలాగానే ఒకే టైం కు వస్తుంది కదా, నేను పేపరు వేసే సమయానికి ఇంట్లో అందరూ లేచేసి ఉండేవాళ్ళు. పేపరును నేను ఆలస్యంగా తీసుకొస్తున్నానని నన్ను తిట్టేవాళ్ళు. అయినా నేను భరించుకొని పేపరును వేయడం కొనసాగించే వాడిని.

**వర్షాకాలం:**

ఎండాకాలం తరువాత వర్షాకాలం వస్తే చాలా సమస్య ఉండేది. రాత్రి కాని, పగలు కాని ఆగకుండా పడతాయి కదా, వర్షాలు 'ఉదయం, సాయంత్రం, తెల్లవారుజాము' అని చూసుకునేవి కావు. వర్షం వస్తే ఇల్లంతా కురిసేది. ఆ వర్షాలకు మా అమ్మ నాన్న "ఈ వర్షాకాలంలో అయినా ఆ పేపరును మానేయిరా" అనేవాళ్ళు. అయినా సరే, నేను మటుకు ఆగకుండా పేపరు వేయటం కొనసాగించాను. ఉదయం లేచేసరికి వర్షం పడుతున్నా, నేను మటుకు పేపరు

వేయడానికి వెళ్ళిపోయేవాడిని. ఆ పేపర్లు తీసుకొని వెళ్ళేటప్పుడు ఒక్కోసారి అవి వెనక ఉన్న కేరేజ్ నుంచి జారిపోయేవి- కొన్ని కొంచెం తడిసేవి; కొన్ని బాగానే నానిపోయేవి.



అలాగే వానాకాలపు బురదలో ముళ్ళు కనబడకుండా ఉండేవి. అప్పుడు నా సైకిల్ టైరుకు ముళ్ళు గుచ్చుకొని ఒకటే పంచర్ అయిపోయేవి. అయినా 'సరే, ఏంచేస్తాం' అని నడిచి వెళ్ళి పేపరు వేసి వచ్చేవాడిని. ఎప్పుడయ్యా పేపర్లు తడిసి పోయాయంటే మా పేపర్ ఏజెంట్ దానికి డబ్బులు కట్టమనేవాడు. లేకపోతే నా జీతంలో డబ్బులు తీసేసేవాడు- దీని వల్ల నా చదువు పోయేది.

ఒకసారైతే ఎప్పటిలాగే నేను వెళ్ళి పేపరు వేస్తున్నప్పుడు అనుకోకుండా కుక్క కరిచింది. చాలా ఇంజక్షన్లు వేయించుకోవాల్సి వచ్చింది. కుక్క కరిచిన తరువాత మా ఇంట్లోవాళ్లు పేపరు వేయటం మానేయమన్నారు. అయితే అప్పటికి నాకు ఇంకో కుర్రాడు దొరకలేదు- 'ఏం చేస్తాం' అని అదే విధంగా పేపరు వేయటం కొనసాగించాను.

అలా రోజూ తొందరగా నిద్ర లేచిపోవటం వల్ల నాకు నీరసంగా ఉండేది. బడిలో క్లాసు జరుగుతున్నప్పుడు కూడా నీరసంతో పడుకొనేసేవాడిని. దాన్ని చూసి మా ఉపాధ్యాయులందరూ నన్ను తిట్టేవాళ్ళు. అప్పట్లో మాతరగతి మొత్తంలోకీ చదువులో మొదటిస్థానం నాదే. కానీ రోజురోజుకీ నా చదువు తగ్గిపోవచ్చింది. చివరికి ఒకరోజు బడిలో మధ్యాహ్న భోజనం చేసిన తర్వాత, మధ్యాహ్నం మొదటి పీరియడ్‌లో- నాకు

కడుపులో నొప్పి మొదలైంది. మా అమ్మా,నాన్న వచ్చి నన్ను హాస్పిటల్‌కి తీసుకువెళ్ళాల్సి వచ్చింది. తెల్లవారే లేవటం, నిద్ర తక్కువవ్వటం వల్ల రక్తహీనత- దాంతో నీరసం- అట్లా మెల్లగా కడుపులో నొప్పి వస్తాయని డాక్టర్ చెప్పారు. అప్పటినుండి నేను పేపర్‌కి వెళ్ళడం మానేశాను.

ఇవీ, పేపర్ బోయ్‌గా నా అనుభవాలు.

కవిత

**అమ్మ**

అమ్మ ఉంటే జీవితం
లేదంటే దు:ఖం
అమ్మను మోసం చేయకు
అవమానం పాలవ్వకు

అమ్మా, నాన్నా నీకోసం
నువ్వూ నీ చదువూ వాళ్ళకోసం
కష్ట పడితేనే సుఖం
సుఖం కోరితే కష్టం!

నువ్వు కష్టపడి దేశాన్ని సుఖపెట్టు
అందరూ కలసి కష్టపడితే - అందరూ కలసి
సుఖపడతారు

అమ్మ ఉంటేనే పిల్లలు!
అమ్మ లేనిదే కల్లలు
అమ్మ అంటే రెండు అక్షరాలు కావు
అమ్మ అంటే ప్రేమకు లక్ష వరాలు.

*రచన: సింహాద్రి, సంతోష, 7వతరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*

తరగతి గదిలో నేర్పే పాఠాలకు, జీవితం నేర్పే పాఠాలకు తేడా ఎందుకుంటోంది?



# పాల భూతం



*రచన: క్రాంతికుమార్, 8 వతరగతిA, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా.*

అనగనగా 'నగరి' అనే ఊళ్లో రంగన్న అనే పాల వ్యాపారి ఒకడు ఉండేవాడు. పాలల్లో నీళ్ళు కలిపి, ఆ కల్తీపాలనే ప్రక్క ఊళ్ళకు తీసుకెళ్ళి అమ్మి, అధిక లాభాలు గడించేవాడు వాడు. అయితేనేమి, చుట్టు ప్రక్కల నాలుగు ఊళ్ళకూ రంగన్న ఒక్కడే దిక్కు- "ఏం చేస్తాం" అనుకుంటూ అందరూ అతని వద్దే పాలు కొనేవాళ్ళు. అలా రంగన్న పాల వ్యాపారం మూడుపువ్వులు-ఆరుకాయలుగా సాగేది.

అయితే రోజులన్నీ ఒకేలాగా ఉండవు కదా, 'క్రాంతి' అనే మరో పాల వ్యాపారి వచ్చాడు ఊళ్ళోకి. చక్కని సీమ గేదెలు పది ఉన్నాయి, అతని దగ్గర. అతను మంచి వ్యాపారి కూడాను- దాంతో అతను రంగయ్యకు పోటీగా పాలు పితికి, నీళ్ళు కలపకుండా అమ్మటం మొదలు పెట్టాడు. ఇంకేముంది,

రంగన్న దగ్గర పాలు కొనే వాళ్ళల్లో చాలామంది క్రాంతి అమ్మే పాలకోసం ఎగబడసాగారు.

ఇలా మూడు నెలలు గడిచేసరికి, 'మా ఊళ్ళో అడుగు పెట్టి, నా నోట్లోనే మన్ను కొడతాడా ఈ క్రాంతి?' అని రంగన్నకు అసూయ పుట్టనే పుట్టింది. ఎలాగైనా అతన్ని నష్టపరచా-లనుకున్నాడు. ఉదయాన్నే నిద్రలేచాక క్రాంతి తిరిగే దారి పక్కనే చిన్న గొయ్యి ఒకటి తీసాడు; దానిమీద ఒట్టి ఆకులు కొన్ని కప్పి ఉంచాడు. "ఎప్పుడైనా తెల్లవారు జామున- మసక వెలుతురులో కళ్ళు కనిపించక- పొరపాటున- క్రాంతి ఆ గొయ్యిలో కాలుపెట్టకుండా ఉంటాడా, అప్పుడు పాలకుండతో సహా పడిపోకుండా ఉంటాడా, కనీసం ఒక్క కాలన్నా బెణకకపోతుందా?" అని రకరకాలుగా ఊహించి పెట్టుకున్నాడు రంగన్న.

ఒకరోజు వేకువజామున రంగన్న ఎప్పటిలాగే పాలకుండను తల మీద పెట్టుకొని ఇరుగు పొరుగు ఊళ్ళకు బయలుదేరాడు. అప్పటికింకా తెల్లవారలేదు. సగం దూరం నడిచేసరికి అడవిలో "ఏయ్! ఆగు!" అని ఎవరో పిలిచినట్లు అనిపించింది. "ఇంత ప్రొద్దున్నే నన్ను పిలిచేదెవరా!" అని ఆశ్చర్యపోతూ వెనుకకు తిరిగాడు అతను.

ఒళ్ళంతా దుస్తులు ఉన్న ఒక ఆకారం గాలిలో తేలుతూ అతని ముందుకు వచ్చింది. దాని నోట్లో కోర పళ్ళు రెండు తళుక్కుమని మెరిసాయి. "ఎవరండీ మీరు? మీకు దారి చూపించాలా?" అడిగాడు రంగన్న, భయపడుతూనే.

"నాకు చాలా ఆకలిగా ఉంది, నీ రక్తం కావాలి" అన్నది ఆ ఆకారం కసిగా రంగన్న వైపు చూస్తూ.

రంగన్నకు చాలా భయం వేసింది. కెవ్వుమని అరుద్దామనుకున్నాడు; కానీ నోట్లోంచి శబ్దం వస్తే గద! అది భూతమే అని నిర్ణయమైపోయింది రంగయ్యకు. "మరి ఇప్పుడేం చెయ్యటం? భూతం నుండి తప్పించుకునేదెలాగ?" రంగన్న గందరగోళ పడ్డాడు.

"ఏమిటి, అట్లా చూస్తున్నావు?" అంది భూతం.

అకస్మాత్తుగా రంగన్నకు ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది. పెద్దపెట్టున నవ్వాడు.

"ఏయ్! ఇంక కొన్ని క్షణాల్లో నువ్వు నాకు ఆహారం అయిపోతున్నావు, ఎందుకు నవ్వుతున్నావురా?" ఉరిమినట్లు అరిచింది భూతం.



"నీ అవివేకానికి నవ్వొచ్చింది"

"ఆ c! ఏం కూశావ్?"

"అవివేకం కాకపోతే ఏమిటి? ఈ కడవలో ఉన్న కమ్మని పాలు తాగక, ఉప్పగా ఉండే రక్తం తాగుతావా? అసలు నీకు పాల మజా తెలుసా?" అన్నాడు రంగన్న.

"ఏమిటీ?! మనిషి రక్తం కంటే రుచిగా ఉంటాయా, పాలు?" ఆశ్చర్యంగా అడిగింది భూతం.

"కావలిస్తే చూడు- ఎంత తియ్యగా ఉంటాయో! ఒక్కసారి తాగావంటే చాలు- ఇంక మళ్ళీ దీన్ని వదిలిపెట్టవు!" అంటూ పాలకుండను అందించాడు రంగన్న.

భూతం గటగటా తాగేసింది ఆ పాలను. "అవునురోయ్! నువ్వు చెప్పింది నిజమే!" అని మూతి చప్పరించింది. "మీ మనుషులు ఇట్లా ఏవేవో కొత్త కొత్తవి కనుక్కుంటూనే ఉంటారే, ఎప్పటికప్పుడు!" అని మెచ్చుకున్నది. "బాగుంది. ఇక ప్రతి రోజూ నువ్వు ఇట్లాగే నాకు పాలు తెస్తూ ఉండాలి" అని జోడించింది.

రంగన్నకు ఒక్కసారిగా కళ్ళు తిరిగినట్లయింది: "ఎలాగోలా ఈరోజుకు తప్పించుకోగలిగాననుకో- ఇక ప్రతిరోజూ పాలు తెచ్చివ్వాలట! మరి నా వ్యాపారం ఏం

కాను?" అని ఏడుపొచ్చింది. అంతలో వాడి దుష్టబుద్ధికి ఒక ఉపాయం తట్టింది.

"చూడు, నువ్వు ఈ నీళ్ళ పాలనే ఇంత మెచ్చుకుంటున్నావు, మరి అసలు పాలు రుచి చూశావంటే ప్రతిరోజూ అవే కావాలని కోరుకోవూ?!" అన్నాడు మర్యాద నటిస్తూ.

"అసలు పాలా? అవెక్కడ దొరుకుతాయి?" అన్నది భూతం, పాల రుచిని మళ్ళీ ఓసారి గుర్తు చేసుకుంటూ.

"కావలిస్తే కాసేపు ఇక్కడే ఉండు- నా వెనుకే ఇంకొకడు వస్తున్నాడు: చిక్కటి పాలు పట్టుకుని! వాటిని తాగావంటే అసలు పాల రుచి ఏంటో నీకు బోధ పడుతుంది" అన్నాడు రంగన్న, 'క్రాంతిని బాగా ఇరికించానులే' అని సంబరపడుతూ.

"అలాగా, అయితే నువ్వెళ్ళు. నేను చూసుకుంటాను వాడి సంగతి" అంది భూతం.

"బ్రతుకు జీవుడా!" అనుకుంటూ రంగన్న అక్కడ నుండి అడ్డదారిన పడి ఊళ్ళోకి పరుగు తీసాడు: "భూతమూ వదిలింది; ఇంకా క్రాంతిగాడి బెడదా తప్పుతున్నది- ఒక దెబ్బకు రెండు పిట్టలు!" అనుకున్నాడు తృప్తిగా.

అయితే ఆసరికి అక్కడ క్రాంతి నిద్రలేచాడు; పాలుపితికాడు; పాల కుండను నెత్తిన పెట్టుకొని నడవటం మొదలు పెట్టాడు ఎప్పటి లాగానే.

కానీ దారి ప్రక్కన ఏనాడో రంగన్న తీసి పెట్టాడుగా, గొయ్యి? -ఆరోజున కాలు ఆ గుంతలో పడింది. ఇంకేముంది- వాడు బొక్క బోర్లా పడిపోయాడు; పాల బాన నేలమీద పడి వంద చెక్కలైంది; ఒక్క చుక్క కూడా మిగలకుండా పాలన్నీ నేలపాలయ్యాయి! అతనికి ఇప్పుడు రెండు బాధలు వచ్చి పడ్డాయి- "పాలన్నీ నేల పాలయ్యాయే" అన్నదొక బాధ. "నేను ఇచ్చే పాలకోసం ఎంతోమంది ఎదురుచూస్తూ ఉంటారే; వాళ్లందరికీ జవాబు చెప్పుకోవాలే!" అన్నది మరో బాధ. "సరే, ఏం చేస్తాం! ఇవాల్టికి పాలు లేవని చెప్పి రావాల్సిందే, అందరికీ!" అనుకొని, వట్టి చేతులతోటే ముందుకు

నడిచాడు క్రాంతి.

అంతలోనే భూతం వాడి ముందుకు దూకింది- "ఏయ్! ఆగు!" అని అరిచింది.

క్రాంతి ఆగాడు. భూతాన్ని చూసి వణికిపోయాడు.

"రేయ్! నేను వచ్చింది నీకోసం కాదులే! అంతగా వణికిపోకు. చిక్కటి పాలు తీసుకొస్తున్న మనిషి కనిపించాడా, నీకు ఎక్కడైనా-.. దారిలో?!" అడిగింది భూతం.

క్రాంతికి ప్రాణం లేచివచ్చింది. "లేదు- చూడలేదు. అయినా అతనితో నీకేం పని?" అడిగాడు.

జరిగిందంతా చెప్పింది భూతం, దాంతో రంగన్న పన్నాగం అర్థమైపోయింది క్రాంతికి. ఇప్పుడు తిరగబడి నవ్వటం అతని పనైంది.

"ఏయ్! ఏమిట్రా ఆ నవ్వు! భయపెడితే తిరగబడి నవ్వటం మీ మనుషులకు ఎక్కడ అలవాటైంది?" అడిగింది భూతం.

"నిజంగానే నువ్వొట్టి వెర్రిబాగులవాడిలాగా ఉన్నావు! ఆ రంగన్న పచ్చి మోసగాడు. ఇంతమందికి రోజూ పాలు పోసి మోసం చేస్తుంటాడే, వాడికి నువ్వొక లెక్కా? నీ నుంచి తప్పించుకోవడానికి ఎంత చక్కని అబద్ధం చెప్పాడో చూడు! మా ఊళ్ళో పాలు అమ్మే మోసగాడు వాడొక్కడే! కావాలంటే వేరే ఎవ్వరినైనా అడుగు- 'నగరి మొత్తంలోనూ పాలమ్మే మోసగాడు ఎవ్వరు?' అని అడిగి చూడు- 'రంగన్న' అని సమాధానం రాకపోతే నా మీసాలు తీయించుకుంటాను!" నవ్వుతూనే అబద్ధం కాని అబద్ధం ఒకటి చెప్పేశాడు క్రాంతి.

"ఆ c! నన్నే మోసం చేస్తాడా! వాడికి తగిన బుద్ధి చెప్తాను ఆగు!" అని పళ్ళుకొరుకుతూ గాలికి కొట్టుకు పోయినట్లు రివ్వున ఎటోదూసుకు పోయింది భూతం. క్రాంతి ఊపిరి పీల్చుకున్నాడు.

ఇక అక్కడ సరిగ్గా రంగన్న ఇంటికి చేరుకునే సరికి భూతం ఊడిపడింది- "ఒరేయ్! నువ్వు నన్ను మోసం చేసావురా! నేను అంతటా అడిగి చూశాను- 'నగరి మొత్తంలోనూ పాలమ్మే మోసగాడివి నువ్వొక్కడివే' అని ప్రతి ఒక్కరూ

చెప్పారు. నువ్వు చేసే మోసపు పనిని వేరే వాళ్ళమీదికి నెట్టుతున్నావు- నిన్నేం చేయమంటావు?" అని గుడ్లురిమింది.

ఇదంతా ఇలా తిరగబడి తనమీదికే వస్తుందనుకోలేదు రంగన్న. "ఏదో మోసం జరిగింది- కావాలంటే వాడి ఇల్లు చూపిస్తాను, నాతో రా!" అని గొణిగాడు.

"మళ్ళీ మోసం చేయాలని చూస్తున్నావా? ఇంక నీ ఆటలు సాగవు. ప్రతి రోజూ నువ్వు నాకు కుండ నిండా పాలు తీసుకొని రావాల్సిందే. నీళ్లపాలు తెచ్చేవు- ఊరుకునేది లేదు! 'అసలు పాలు'అన్నావే, అవే తీసుకు రావాలి. లేదంటే ఇక నీ పని ఇంతటితో సరి! జాగ్రత్త!" అంటూ మాయం అయింది భూతం.

రంగన్న బట్టలన్నీ చెమటతో తడిసిపోయాయి. ఇక ఆనాటి నుంచీ ప్రతిరోజూ కడివెడు పాలు భూతానికి సమర్పించుకోలేక తప్పలేదు వాడికి!

**నేనూ-నా భాష**

అమ్మంటే నాకిష్టం

mummy అంటే తనకిష్టం

నాన్నంటే నాకిష్టం

daddy అంటే తనకిష్టం

చేపంటే నాకిష్టం

fish అంటే తనకిష్టం

జాంపండంటే నాకిష్టం

guava అంటే తనకిష్టం

భాషంటే నాకిష్టం

Language అంటే తనకిష్టం

తెలుగంటే నాకిష్టం

English అంటే తనకిష్టం

సులువైన సొంత భాషంటే నాకిష్టం

ఇంగ్లీషులో నెగ్గాలంటే తెలుగే శ్రేష్ఠం

*రచన: డి.హేమసుందర్, 7వతరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*



# చిట్టెలుక - సింహం

*రచయితల ఆలోచనలకు ప్రతిబింబాలు కథలు. చదివేవాళ్లను సాధారణంగా ఆ ఆలోచనల్లోని క్రమం ఆకర్షిస్తుంది. అయితే ఒక్కోసారి ఆ ఆలోచనల్లో మరీ ఎక్కువ క్రమం లేకపోతేనే ముచ్చటగా ఉంటుంది- ఇదిగో, ఇలాగ!*

*రచన: యం. ఉపేంద్ర, 8 వ తరగతి B, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*

అనగనగా ఒక ఊరిలో ఒక ఎలుక ఉండేది. దాని పేరు చిట్టి.

చిట్టి ఒక రోజున ఒక పాములవాడి ఇంటికి వెళ్ళింది. పాము ఎలుకను పట్టుకోబోయింది. "నాకు ఇక్కడ నచ్చలేదు" అని చిట్టి బయలుదేరి, పిల్లి వాళ్ల ఇంటికి వెళ్ళింది.

అక్కడ పిల్లి గభాలున దూకి ఎలుకను మింగబోయింది. "నాకు ఇక్కడ నచ్చలేదు" అని బయటికొచ్చి ఏనుగు వాళ్ళ ఇంటికి వెళ్ళింది చిట్టి.

అక్కడికి వెళ్ళేసరికి, ఏనుగులన్నీ ఎలుక మీదికి వచ్చాయి. "నాకు ఇక్కడా నచ్చలేదు- రాజు గారి ఇంటికి వెళ్తే ఎంతో బాగుంటుంది" అనుకున్నది చిట్టి. ఇక దానికి అడ్డు ఏమున్నది?

-అట్లా అది రాజుగారి ఇంటికి వెళ్ళింది. నేరుగా రాజు గారి గదిలోనికే చేరుకున్నది. తన పళ్లతో రాజుగారి మంచపు నవారును కరకరా కొరికేసింది. తెల్లవారాక చూస్తే మంచం మీద పడుకొని ఉండాల్సిన రాజుగారు గచ్చు మీద

ఉన్నారు!

రాజుగారు ఆశ్చర్యపోయారు. "నేను మంచం మీద కదా, పడుకున్నది? మరి గచ్చు మీద ఎందుకు వున్నానబ్బా?" అని ఆలోచించారు.

ఆ విషయం మీద మంత్రులందరితోటీ సమావేశం ఏర్పాటు చేశారు. అందరూ ఆలోచించారు; కానీ నిజంగా ఏం జరిగిందో మటుకు తెలుసుకోలేక పోయారు.

ఆ రోజునే రాజుగారు, ఆయన పరివారం అందరూ సినిమాకు వెళ్ళారు. వాళ్ళంతా వచ్చేలోగా రాజుగారి గది నుంచి భవనం అంతా సొరంగ మార్గం తయారు చేసింది చిట్టి. తిరిగి రాగానే రాజు గారు ఈ సొరంగం చూసారు. మళ్ళీ ఓసారి అందరితో సమావేశం అయ్యారు. అందరూ ఆలోచించారు. 'ఇది ఎలుకల పనే' అని తేల్చారు.

దాంతో రాజుగారు ఎలుకలన్నిటినీ చంపెయ్యమన్నారు. అంతే! భటులు రాజభవనం అంతా వెతికి, చేతికి చిక్కిన ఎలుకలన్నిటినీ చంపేసారు.

-కానీ చిట్టిని మాత్రం ఏమీ చెయ్యలేక పోయారు.

ఆరోజు రాత్రి రాజుగారు నిద్రపోతుండగా చిట్టి రాజుగారి కిరీటం మీదికకి ఎక్కి, గెంతుతూ పాడింది:

నేనే నేనే ఎలుకను-
బుడి బుడి అడుగులు వేస్తాను,
చిట పటా-చిట పటా తిరుగుతాను,
నన్ను ఎవ్వరూ పట్టుకోలేరు-
నల్ల పిల్లి అయినా పట్టుకోలేదు!
నేను గోతులు తీస్తాను,
నేను నల్లగా ఉంటాను,
నేనే నేనే ఎలుకను.

ఆ పాట పాడి హాయిగా నిద్రపోయింది అది.

కళ్ళు తెరిచి చూసేసరికి, ఎలా వచ్చిందో మరి- అది ఒక చిన్న బోనులో ఉంది! చూస్తూండగానే రాజుగారి మనుషులు దాన్ని అడవికి తీసుకెళ్ళి, ఒక కొలనులో పడేసారు.

చిట్టికి ఒక క్షణంపాటు ఊపిరాడనట్లు

అయ్యింది. ప్రాణం పోతుందనిపించింది- అయితే అంతలోనే అక్కడికి వచ్చిన సింహం ఒకటి నీళ్ళలోకి దూకింది; చిట్టిని పంజాతో పట్టుకున్నది; బయటికి తెచ్చి నేలమీద పడేసింది. "చిన్న ఎలుకను తినేదెందుకులే" అనుకున్నది. అట్లా సింహం, చిట్టి మిత్రులయ్యారు.

అటు పైన వాళ్ళిద్దరూ ఎన్నెన్నో ప్రదేశాల్లో కలిసి తిరిగారు. సింహమేమో రాత్రిపూట జింక చర్మం పైన నిద్రపోయేది. ఎలుకేమో నేలలో ఒక గొయ్యి తీసి నిద్రపోయేది. వాళ్ళిద్దరూ ఒకరికొకరు చాలా కవితలు చెప్పుకున్నారు:



సింహం చెప్పిన కవిత-

అడవిలో అన్న

ఇంటిలో వెన్న

జోబులో పేనా!

అప్పుడు ఎలుక చెప్పిన కవిత:

మొగ్గ చూసేది పువ్వుకోసం

పువ్వు చూసేది పరిమళం కోసం.



పేపరు చదివేటప్పుడు కూడా అవి కవితలు చెప్పుకునేవి:

చదవాలి చదవాలి చదవాలి

చదివి నీవు పై మెట్టు ఎదగాలి

చదువుతూ ఆనందంగా ఉండాలి.

చదివి వెలుగు మా అయ్య తెలుగు బిడ్డ!

అట్లా పాటలు, పద్యాలు, కవితలు వాళ్ళిద్దరినీ బాగా కలిపాయి. ఇద్దరూ ఎంత మంచి స్నేహితులయ్యారంటే, ఇక ఎన్నడూ విడిపోలేదు!




# విలువైన స్నేహం



*రచన: ఎం. పద్మారావు, 8 వ తరగతి B, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*

"గ్రేట్ సర్కస్ కంపెనీ"లో చాలా ఏనుగులు పనిచేస్తుండేవి. అందులో ఒక దాని పేరు కర్ణిక.

కర్ణిక చేసే విన్యాసాల్ని చూడటానికి చాలా మంది ఎగబడేవాళ్ళు. అయితే కొన్నాళ్ళకు దానికి ఏదో జబ్బు చేసింది. దాని వల్ల అక్కడ వున్న ఏనుగులకు కూడా జబ్బు సోకుతుందని సర్కస్ వాళ్ళకు అనుమానం వచ్చింది. దాంతో వాళ్ళు దాన్ని తీసుకెళ్ళి అడవిలో వదిలేశారు.

అయితే అడవిలో స్వేచ్ఛగా తిరుగుతూ, దానికి ఇష్టమైన ఆహారం తినటం వల్ల, కొన్నాళ్ళకు దాని జబ్బు నయం అయిపోయింది. అటుపైన కర్ణిక అడవంతా తానే అయి ఉల్లాసంగా బ్రతకటం మొదలు పెట్టింది. అయితే సర్కస్ కంపెనీలో అన్ని జంతువుల మధ్య స్నేహంగా మెసిలింది కదా, 'ఇప్పుడు

తనకు ఒక్క మిత్రుడూ లేడే' అని దానికి ఏదో వెలితిగా ఉండేది.

అయితే ఒకసారి ఒక వేటగాడు అడవిలో ఒక గొయ్యి తీసి, దాని పైన కర్రలు, వాటి మీద ఆకులు వేసి వెళ్ళిపోయాడు. 'ఏనుగులో, పులులో- ఏవో ఒకటి ఆ గుంటలో పడక పోతాయా, వాటిని తను పట్నంలో అమ్ముకొని డబ్బు చేసుకోవచ్చుకదా' అని వాడి ఉపాయం. అయితే వాడు చేసిన పనిని గమనించింది ఒక జింక. వాడి ఉపాయం కూడా దానికి అర్థం అయ్యింది. అయితే కర్ణికకు తెలీదుగా, అటువైపు గొయ్యి ఉందని? అందుకని ఆరోజు సాయంత్రం అది అటువైపు వెళ్ళబోయింది. దాన్ని అడ్డుకున్నది జింక- "ఓయ్! నువ్వెవరో మరీ అమాయకపు ఏనుగులాగా ఉన్నావు. అక్కడ, ఆకుల మాటున ఓ పెద్ద గొయ్యి ఉంది. నువ్వు అటువైపు వెళ్ళావంటే అందులో పడిపోతావు- జాగ్రత్త!" అని చెప్పింది.

కర్ణికకు చాలా సంతోషం వేసింది. "నువ్వు నన్ను కాపాడావు జింకా! ఇంతకు ముందు కూడా ఒకసారి- నేను చిన్నగా ఉన్నప్పుడు- చూసుకోక ఒక గుంటలో పడిపోయాను. అట్లా సర్కస్ కంపెనీలో ఇరుక్కొని అన్ని సంవత్సరాలు ఊడిగం చేయాల్సి వచ్చింది. నన్ను కాపాడినందుకు చాలా చాలా ధన్యవాదాలు. నీపేరేమిటి?" అన్నది.

"నాపేరు గిసర" చెప్పింది జింక.

"నువ్వు నాతో స్నేహం చేస్తావా, నేను ఈ అడవికి కొత్త?" కర్ణిక అడిగింది.

"ఓఁ..ఎంచక్కా చేస్తా" అన్నది జింక. అలా కర్ణిక, గిసర చక్కని స్నేహితులయ్యారు. ఎప్పుడూ ఇద్దరూ కలిసి తిరిగేవాళ్ళు; కలిసి మేతకు వెళ్ళేవాళ్ళు. ఇలా కొన్నాళ్ళు గడిచే సరికి వాళ్ళిద్దరూ ప్రాణ స్నేహితులు ఐపోయారు.

అదే అడవిలో నివసిస్తూ ఉండేవి, ఒక నక్క-ఒక కుక్క. ఎలాగైనా సరే, గిసరను చంపి తినాలని వాటికి కోరికగా ఉండేది. అయితే ఇప్పుడు వాటికి అది సాధ్యం అయ్యేట్లు లేదు. ఎందుకంటే గిసర, కర్ణిక ఎప్పుడూ కలిసే తిరుగుతున్నాయి కదా, అందుకని.

అందుకని నక్క-కుక్క రెండూ కలిసి ఒక పథకం వేసాయి: ముందుగా జింక వెళ్ళే దారిలో ఒక గుంతను త్రవ్వి, దాని మీద కొమ్మలు ఆకులు కప్పాయి-



ఆ తర్వాత నక్క జింక దగ్గరికి వెళ్ళి అన్నది- "అటువైపుకు వెళ్లద్దు జింకా- నేను ఇప్పుడే చూశాను. ఒక వేటగాడు వచ్చాడు అడవికి. నిన్ను పట్టుకునేందుకే కావచ్చు- అక్కడో గుంత త్రవ్వి పెట్టాడు" అని ప్రేమ నటిస్తూ చెప్పింది. తన ప్రాణాలు కాపాడింది కదా, అందుకని గిసరకు నక్క అంటే అభిమానం ఏర్పడ్డది. "మరి నాతో స్నేహం చేస్తావా?" అని అడిగింది నక్క. "ఓ..దానిదేముంది. ఇవాల్టినుండీ మనం ముగ్గురు మిత్రులం" అన్నది అమాయకపు గిసర, దాన్ని పరిచయం చేసేందుకు కర్ణిక దగ్గరికి తీసుకెళ్తూ.

అయితే కర్ణికకు నక్కను చూడగానే అనుమానం వేసింది. ఆహారంకోసం నక్క ఎన్ని మాయలైనా చేస్తుందని తెలుసు, దానికి. అయినా అది తనకున్న అనుమానాలను గిసరతో పంచుకోలేదు. 'నక్కను గమనించి చూస్తాను' అని మాత్రం అనుకున్నది.

అయితే తన పథకంలో భాగంగా నక్క గిసరకు కర్ణిక గురించి రోజుకింత చెడ్డగా చెప్పటం మొదలు పెట్టింది. మొదట్లో గిసర దాని మాటలు నమ్మలేదు. కానీ నక్క ఎన్ని దొంగమాటలు చెప్పిందంటే, చివరికి గిసర దాని వలలో పడనే పడింది. అటుపైన అది కూడా కర్ణికను అనుమానించటం, అవమానించటం మొదలుపెట్టింది.

అయినా సరే, కర్ణిక అవేవీ పట్టించుకునేది కాదు. తన స్నేహితుడైన గిసరను నక్క నుండి

కాపాడాలని అది ఎంతో ప్రయత్నించింది. అయినా జింక దాని మాటలేవీ వినలేదు. పెడచెవినపెట్టింది.

కొన్నాళ్ళకు వాళ్ళకి దూరమైనట్లు నటించసాగింది కర్ణిక. అయినా ఎల్లప్పుడూ గిసరను తన కనసన్నలలోనే ఉండేట్లు చూసుకున్నది. నక్కకు ఆ సంగతి తెలీదు కదా, 'పీడ విరగడైంది' అని అది చాలా సంతోషించింది. "గిసరకు సమయం దగ్గరపడింది. రేపు దీన్ని గుంతలోకి నెట్టేద్దాం, గుంత తీసి సిద్ధంగా ఉంచు" అని కుక్కకు కబురుపంపింది.

అయితే నక్క కదలికలపైననే గట్టి నిఘా పెట్టిన కర్ణికకు, వాటి పథకం అంతా అర్థమైంది. గుంతను త్రవ్వేసి కుక్క అటు వెళ్ళిందో లేదో- కర్ణిక ఆ గొయ్యి దగ్గరికి చేరింది; నక్క ఊహించని విధంగా ఆ గొయ్యిని మరింత లోతుగాను, మరింత వెడల్పుగాను త్రవ్వి పెట్టింది!

మరునాడు నక్క గిసర దగ్గరికి వెళ్ళి- "మిత్రమా! అడవికి అటువైపుకు మనం ఎప్పుడూ వెళ్ళలేదు- ఆ ప్రక్కన మంచి గడ్డి ఉన్నదని కుక్క చెప్పింది నాకు. ఇవాళ్ల అటు పోదాం పద!" అని అటువైపుకు తీసుకుపోయింది.



ఇద్దరూ నడుస్తుండగా అకస్మాత్తుగా నక్క గిసరను ఆ గుంతలోకి తోసేసి, వికవికా నవ్వింది-"ఇప్పుడు దొరికావు,నువ్వు మాకు" అన్నది. అయితే అది కూడా గుంత మీదనే నిలబడి ఉన్నది కద! అలా అటు అది నవ్వటం, ఇటు దాని కాళ్లక్రింది నేల కదిలి అదికూడా 'దభాలు'న గుంతలో పడిపోవటం ఒకేసారి

జరిగిపోయాయి!

దగ్గరలోనే నిలబడ్డ కర్ణిక గుంత దగ్గరకు వచ్చి, తన తొండాన్ని అందించి గిసరను బయటికి లాగింది. తన తప్పు తెలుసుకున్న గిసర సిగ్గుతో తల వంచుకున్నది.

మరుసటి రోజున వేటగాడెవరో వచ్చి, తను త్రవ్విని గుంతలో చిక్కుకున్న నక్కను పట్టుకొని చక్కా పోయాడు! ఇదంతా చూసిన కుక్క పరుగో పరుగు!

అటుపైన గిసర-కర్ణికల స్నేహం పదికాలాలపాటు చల్లగా కొనసాగింది.

**చందమామ-నెహ్రూమామ**

చందమామ నవ్వితే మల్లెపువ్వు
నెహ్రూ మామ నవ్వితే గులాబి పువ్వు
చందమామ ఇచ్చేది వెన్నెల
నెహ్రూ మామ ఇచ్చేది నవ్వులు
చందమామకి శుక్లపక్షం కృష్ణపక్షం
నెహ్రూ మామ ఎప్పుడూ పిల్లల పక్షం
చందమామ చుట్టూ నక్షత్రాలు
నెహ్రూ మామ చుట్టూ పిల్లలు
చందమామ దేశానికి వెలుగు
నెహ్రూమామ బాలలకు వెలుగు
చందమామ ఆకాశంలో
నెహ్రూమామ పిల్లల్లో.

*రచన: కె.తిరుపతిరావు,7వ తరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి*

**నిజంగా కట్టిందెవ్వరు?**

టీచర్: బాలూ! చార్మినార్ ఎవరు కట్టారో తెలుసా?

బాలు: ఓ, తెలుసు టీచర్! చార్మినార్‌ను మేస్త్రీలు కట్టారు.



**పీల్చు-వదులు!**

డాక్టర్: ఏమయ్యా, ముసలాయనా! హాస్పటల్‌లో "పొగత్రాగరాదు" అని అంత పెద్ద అక్షరాలతో రాసి పెట్టామే! మరి నువ్వు చేస్తోందేమిటయ్యా?!

ముసలాయన: అయ్యో, సార్, నేను పొగత్రాగటం లేదు సార్, ఊరికే పీల్చి వదిలేస్తున్నాను- అంతే సార్!

యు.కనకరాజు,8వ తరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.



# చేపలు - కప్పలు

*ఆధారం : పి. నాగభూషణరావు, ఎనిమిదో తరగతి A, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*

అనగనగా ఒక మడుగులో చాలా కప్పలు, చేపలు ఉండేవి. అవి ఒకదానినొకటి గౌరవించుకుంటూ సంతోషంగా బ్రతికేవి.

అయితే ఒక రోజున ఏమైందంటే, ఓ కప్పపిల్ల వెళ్ళి ఒక చేపపిల్లని తినేసింది. దాన్ని చూసింది తల్లి చేప. వెంటనే చేపలన్నీ కలిసి కప్పపిల్లని చుట్టుముట్టాయి. మా చేపపిల్లని ఎందుకు తిన్నావు?" అని నిలదీసాయి.

అలా భంగపడిన చేపపిల్ల కోపంతో, సిగ్గుతో ముఖం మాడ్చుకుని ఇల్లు చేరుకున్నది. "ఏమ్మా, ఇంత సేపూ ఎక్కడున్నావు?" అంది తల్లి కప్ప. కప్పపిల్ల చెప్పింది- "నేనేదో ముచ్చటపడి ఒక చేపపిల్లను తినేసరికి చేపలన్నీ నా మీదపడి కొట్టినంత పని చేసాయి" అని.

తల్లికప్పకు కోపం వచ్చింది. "ఏమట, మామూలు చేపలకి ఇంత ధైర్యం ఎక్కడినుండి వచ్చింది? ఒక చేపను తింటే అంత రభస ఎందుకు?" అని తన తోటి కప్పలన్నిటినీ

పిలువనంపింది.

కప్పలు అన్నీ వచ్చాయి. చేపలమీదికి దాడికి వెళ్ళినట్లు వెళ్ళాయి. "ఎవరు, మా కప్ప పిల్లని తిట్టింది? అంత మర్యాద లేకుండా అయినామా?" అన్నాయి.

"మీ కప్ప మాచేప పిల్లని తినేసింది- తిట్టకపోతే ఊరుకుంటామా?" అని అన్నది చేప తల్లి.

"నాకు ఆకలి వేసింది, కనుక తిన్నాను- ఏం తప్పు?" అంది కప్ప పిల్ల.

"అదేం మాట?! మా పిల్లలే మీకు ఆహారమా! ఈ దగ్గరలో వున్న పురుగుల్ని తినచ్చుకదా!" అంది చేప తల్లి, రోషంగా.

"జరిగిందేదో జరిగిందిలెెండి. ఇక నుంచి మీ జోలికి మేము రాము" అంది కప్పతల్లి, కొంచెం దిగివచ్చి.

"మీరు మా జోలికి వస్తే ఊరుకుంటామా?" అన్నాయి చేపలు. "మా చేపపిల్లని తిన్న ఆ కప్పపిల్లను మాకు అప్పగించాలి- అది మేం వేసే శిక్షను అనుభవించాలి. అప్పుడే మేం ఊరుకునేది" అని పట్టు పట్టాయి.

"పిల్లవాడు, తెలీక ఏదో చేస్తే దాన్ని పెద్దది చేయకూడదు. ఊరికే శిక్ష-గిక్ష అని మాట్లాడతారేమి?" అన్నాయి కప్పలు.

గొడవ పెద్దదయిపోతుండగా కప్ప పిల్ల ముందుకు వచ్చింది అకస్మాత్తుగా- "సరే, కానివ్వండి. మీరు ఏ శిక్ష వేస్తే ఆ శిక్ష భరించటానికి సిద్ధంగా ఉన్నాను. ఊరికే చేపపిల్లను తినటం తప్పే, నేను నా తప్పును ఒప్పుకుంటున్నాను" అన్నది.

తల్లికప్పతో సహా కప్పలన్నీ నిశ్శబ్దం అయిపోయాయి.

చేపలన్నీ గెలిచినట్లు సంబరపడ్డాయి.

కప్పలన్నీ కళ్ళనీళ్ళు పెట్టుకొని, రోషంగా వెనక్కి మళ్ళాయి.

అంతలో తల్లిచేప అడిగింది మిగిలిన చేపల్ని-"దీనికి ఏం శిక్ష విధిద్దాం?" అని.

"చంపేద్దాం" అన్నాయి కొన్ని.

"నీ ఇష్టం- నువ్వు ఏ శిక్షంటే ఆ శిక్ష విధిద్దాం" అన్నాయి కొన్ని చేపలు.

ఒక్క ముసలి చేప మటుకు "దాన్నేం చేయద్దు-

ఊరికే వదిలేద్దాం" అన్నది.

తల్లి చేప ఒక్క క్షణం పాటు ఆలోచించింది- "నిజమే.. దీన్ని వదిలేద్దాం. పశ్చాత్తాప పడింది కదా, అది చాలు. దీని ప్రాణాలు తీసినంతమాత్రాన నా బిడ్డ బ్రతికి వస్తుందా, ఏమి?" అన్నది.

ఆ సరికి 'చేపలన్నిటినీ ఎలా చంపెయ్యాలి?'అని వ్యూహం రచిస్తున్నాయి కప్పలు. అకస్మాత్తుగా "ఆగండి! ఆగండి! నేనూ వస్తున్నాను" అని అరుస్తూ వస్తున్న తమ కప్పపిల్లని చూసి అవన్నీ ఆశ్చర్యపోయాయి. దాన్ని ఏమీ చెయ్యకుండా వదిలేసిన చేపలంటే వాటికి చాలా గౌరవం కల్గింది. వెంటనే వెనక్కి వెళ్ళి చేపలకు ధన్యవాదాలు చెప్పుకున్నాయి.

"ఏమీ పర్లేదులే, తప్పులు అందరూ చేస్తూనే ఉంటారు. తెలివిగా వాటిని దిద్దుకుంటే అంతే చాలు" అన్నాయి చేపలు, హుందాగా.

అటుపైన ఆ చెరువులో చేపలు, కప్పలు హాయిగా కలిసి జీవించాయి.

క్షమించటంలో గొప్ప శక్తి ఉన్నది.

**ఎవరి ఏడుపు వాళ్లది!**

యజమాని: రంగయ్యా! పాప కూర్చుని ఏడుస్తుంటే నువ్వు ఏం చేస్తున్నావయ్యా?

రంగయ్య: నేను కూడా కూర్చుని ఏడిస్తే బాగుండదు కదా, బాబయ్యా!

నవ్వండి!

**ఆవు సమస్య!**

రాము: సోమూ, భీమూ! ఆవు ఎలా ఉంటుంది?

సోము: ఆవు, ఆవు లాగే ఉంటుంది.

భీమ: ఆవు గడ్డితింటూ ఉంటుంది.

రాము: మీ ఇద్దరూ తప్పు చెప్పారు.

భీమ: మరి నువ్వు చెప్పురా, ఎట్లా ఉంటుంది ఆవు?

రాము: ఆవును తాడుతో కట్టేస్తే ఉంటుంది.



# మంచి స్నేహితులు

*పంచతంత్రపు కథల్ని కలుపుకుంటే మనమూ చాలా కథలు సృష్టించగలమేమో! చూడండి, ఈ కథలో జంతువులు మనకు బాగా పరిచయం ఉన్నట్లు అనిపించటం లేదూ..?*

*రచన: కె.నవీన్ కుమార్, 8 వతరగతి B, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*

జన్నారపు అడవిలో నివసించే తాబేలు, ఎలుక, కొంగ చాలా మంచి స్నేహితులు. అవి రోజూ ఆడుతూ, పాడుతూ ఉండేవి- దాహం వేసినప్పుడల్లా అక్కడే ఉన్న చిన్న చెరువుకు వెళ్ళేవి. అక్కడ తాబేలు గెంతుతూ, కొంగ ఈత కొడుతూ, ఎలుక స్నానం చేస్తూ, ఆనందంగా గడిపేవి. అయితే ఒక సంవత్సరం వర్షాలు లేవు- ఎండలు మండిపోయాయి. ఆ చిన్న చెరువులో నీళ్లు, ఒక్కసారిగా ఎండిపోయాయి.

కొంగకు, ఎలుకకు, తాబేలుకు చాలా దాహం వేసి, ఎప్పటిలాగానే పరిగెత్తు కుంటూ చెరువు

దగ్గరికి వచ్చి చూస్తే ఏముంది?- చుక్క నీళ్ళు లేవు!

"ఆగండి, నేను చూస్తాను" అని చెరువు మధ్యలో సూటిగా ఒక బొరియను త్రవ్వింది ఎలుక. అయినా, ఎంత లోతు పోయినా మట్టిలో తేమ తప్ప, నీళ్ళు ఉండే సూచనలే కనిపించలేదు.

నీళ్ళు లేక మూడూ త్వరలోనే చాలా నీరసించి పోయాయి. కొంగయితే మరీ కదల్లేని పరిస్థితికి చేరుకున్నది. స్నేహితులిద్దరితోనూ అది అన్నది-"ఓ నేస్తాల్లారా! నేను చాలా నీరసించిపోయాను. నాకు నీళ్ళతోబాటు తినేందుకు ఇంత ఆహారం కూడా అవసరం. మీరు ఎవరైనా నాకు కొంచెం ఆహారం, ఇన్ని నీళ్ళు తెచ్చిపెట్టండి, దయచేసి" అని.

తాబేలు ఎలుక ఆలోచించాయి. ఎలుక తాబేలుతో అన్నది- "నేను పడమర వైపుకు వెళ్తాను; నువ్వు తూర్పు వైపుకు వెళ్లు- ఎక్కడైనా చెరువులు కనిపిస్తే తిరిగి వచ్చి ఎలాగో ఒకలాగా కొంగను తీసుకెళ్దాం, ఇద్దరం" అని.

తాబేలు 'సరే' అన్నది. రెండూ అడవంతా తిరిగి వెతకటం మొదలుపెట్టాయి.

అంతలో ఎలుకకు ఒక పావురాల గుంపు కనిపించింది. వాటిని చూడగానే ఎలుక భయపడి దాక్కున్నది కొంతసేపు. అయితే అవేవీ ఎగరటం లేదు- ఎంత సేపు చూసినా నేలమీదే తిరుగుతున్నాయి.



"ఎందుకిలా?" అని చూసిన ఎలుకకు నేలంతా పరచుకున్న వల ఒకటి కనిపించింది. అది పావురాలతో అన్నది- "మీరంతా పాపం, వలలో చిక్కుకున్నట్లున్నది. నన్ను ఏమీ

చెయ్యమని మాట ఇస్తే నేను ఈ వలను కొరికి మిమ్మల్ని కాపాడేందుకు ప్రయత్నించగలను" అని.

పావురాలన్నీ సంతోషంగా "మా పాలిట దేవుడిలాగా వచ్చావు. మమ్మల్ని కాపాడు; నీకు ఏ పని కావాలంటే అది చేసిపెడతాం, మేం" అన్నాయి.

అప్పుడు ఎలుక వలను కొరికి తెంపివేయగానే పావురాలన్నీ దానికి ధన్యవాదాలు తెలుపుకున్నాయి. "నాకు ఈ ధన్యవాదాలు వద్దు- మా మిత్రుడు కొంగ చావు బ్రతుకుల్లో ఉన్నది. మరొక మిత్రుడు తాబేలు, నేను నీళ్లకోసం అడవంతా వెతుకుతున్నాం. మీకు తెలిసి ఎక్కడైనా ఒక చెరువు ఉంటే చెప్పండి చాలు" అన్నది ఎలుక వాటితో.

"అయ్యో! దానిదేమి భాగ్యం?! మేముండే చోటనే నిజానికి ఒక పెద్ద చెరువు ఉన్నది. దానిలో పుష్కలంగా నీళ్ళు ఉన్నాయి. మిమ్మల్ని ముగ్గురినీ మేం అక్కడికి తీసుకెళ్తాం" అని పావురాలు ఎలుక వెంట వచ్చాయి.

ఆలోగా తాబేలు కొంగ దగ్గరికి చేరుకున్నది. దానికి పాపం చెరువు దొరకనేలేదు. "నాకు ఏమీ కనిపించలేదు" అని అది చెబుతుండగానే అక్కడికి ఎలుక, పావురాలు వచ్చి చేరుకున్నాయి. "మా మీద కూర్చోండి! మేం తీసుకెళ్తాం మిమ్మల్ని!" అని పావురాలన్నీ రథం మాదిరి నిల్చున్నాయి. కొంగ, ఎలుక, తాబేలులను ముగ్గురినీ మోసుకొని కొద్ది సేపటిలోనే అవి ఒక పెద్ద చెరువును చేరుకున్నాయి!

నీటితో నిండి, ఎండలో తళతళలాడుతున్న ఆ చెరువును చూడగానే మిత్రులు ముగ్గురికీ ప్రాణం లేచివచ్చినట్లు అయింది. ఆనాటినుండీ అవి, పావురాలు అన్నీ కలసి సంతోషంగా బ్రతికాయి.

'ఎండిపోయిన చెరువు పుణ్యమా' అని చాలామంది మిత్రులయ్యారు!



# సామాజిక జీవనం

*మూలం: జి.భూపతి, 9 వతరగతి A, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*
*పున:కథనం: కొత్తపల్లి.*

యస్ఆర్‌కే పురంలో నివసించే రవి మంచివాడే, చాలా తెలివైనవాడు కూడా- కానీ మహా పెంకి. అతని పెంకితనం వల్ల ఇతరులకు చాలా కష్టం కలిగేది; అయినా సరే, వాడు 'నా దారి-నా యిష్టం'అన్నట్లు ఉండేవాడు. వాడిలో ఉన్న అహంకారం అందరికీ కనబడటం వల్లనేమో, మరి వాడంటే ఎవరికీ పెద్ద ఇష్టం ఉండేది కాదు. అయినా ఏం చేస్తారు? ఎవరికివాళ్ళు మనసులోనే వాడిని తిట్టుకొని ఊరుకునేవాళ్ళు.

మనసారా వాడిని ఇష్ట పడేవాళ్ళెవరైనా ఉన్నారంటే అది వాళ్ళ అమ్మ మాత్రమే. వాడు ఎంత మొరటుగా ప్రవర్తించినా, ఆవిడ సర్దుకుపోయేది. వాడిని పల్లెత్తు మాట అనేది కాదు. దాంతో రవికి ఊరంటే ఒక నిశ్చితమైన అభిప్రాయం ఏర్పడిపోయింది: 'తనూ-తన

తల్లీ ఒక పక్షం. ఊళ్ళోవాళ్లంతా వేరే పక్షం. ప్రజలు తమను చాలా హీనంగా చూస్తుంటారు. అయినా ఎప్పుడూ తమను ఎట్లా దోచుకోవాలా అనే ఆలోచిస్తుంటారు..' ఇలా సాగేవి వాడి ఆలోచనలు. వాడి ఈ అభిప్రాయాన్ని కాదనేందుకు ఊళ్ళో ఎవరూ లేరు- ఎవరి పనుల్లో వాళ్ళు ఉంటారు కదా, వీడి ఆలోచనలు పట్టించుకునేంత తీరిక ఎవరికుంటుంది?

ఒకరోజున రవి వాళ్ళ నాన్న మంచాన పడి ఇక లేవలేదు. పట్నంలో డాక్టర్లు అతన్ని చూసి పెదవి విరిచారు. ఆ సమయంలో రవి ఆరో తరగతిలో ఉండేవాడు. 'తల్లి ఒక్కతే ఇల్లు నడిపించటం కష్టం కదా' అని తనూ కూలి పని చేస్తానని బయలుదేరాడు వాడు. అప్పుడు వేసవి సెలవలు-పెద్దగా పనులు కూడా ఉండేవి కావు. "వేలెడంత లేవు-నువ్వేం పని చేస్తావురా" అని ఊళ్ళోవాళ్ళు నవ్వినప్పుడు వాడికి చాలా కోపం వచ్చేది. ప్రజలపట్ల వాడికున్న కోపం మరింత వేళ్ళు ఊనుకునేది.

అయితే వాడు కూలిపని చేయటం మొదలు పెట్టాక, ప్రజలంటే వాడికున్న అభిప్రాయం కొద్దిగా మారింది-

"పారను ఇలా కాదురా, ఇట్లా తిప్పి పట్టుకోవాలి- గొడ్డలి వేటు బలంగా వెయ్యాలి, ఒకసారి వేటు పడిన చోటే మళ్ళీ పడాలి- పనిలో కూడా తెలివిని ఉపయోగించాలి, వాటంగా పనిచెయ్యాలి .."అంటూ చాలా విషయాలు నేర్పారు అందరూ. "చిన్నవాడమ్మా, ఈ పని చెయ్యలేడు- మనమే ఎత్తుదాం రండి" అని వాడు చెయ్యాల్సిన బరువు పనుల్ని తమ మీద వేసుకునేవాళ్ళు కొందరు. కొందరు వాడికి తాము తెచ్చుకున్న పదార్థాలు పెట్టేవాళ్ళు. "మీ నాన్నకు ఈరోజు ఎలా ఉంది?" అని వాకబు చేసేవాళ్ళు. పొలపు కాపులు వీళ్ళ ఇంటికోసమని ప్రత్యేకంగా కూరగాయలు, ఆకు కూరలు కోసుకు పొమ్మనేవాళ్ళు.

ఇట్లా ఊళ్ళోవాళ్ళు తన పట్ల ప్రేమగా వ్యవహరించినప్పుడు రవి ఆశ్చర్య-పోయేవాడు. వాళ్ళు తమని పట్టించు-కుంటున్నప్పుడు 'వీళ్ళకు ఇట్లా ఉండాల్సిన అవసరం ఏమున్నది?' అనిపించేది వాడికి.

బడులు తెరచేసరికి ఊళ్ళోవాళ్ళంతా చెప్పారు రవి వాళ్ల అమ్మకు- "వీడికి మంచి తెలివితేటలు ఉన్నాయమ్మా, బడి మాన్పించకు. కావాలంటే ఉదయం-సాయంత్రం మేమే ఏమన్నా పనులు చూపిస్తాం- అవి చేసుకుంటూ చదువుకొమ్మను" అని. వాళ్ళ ఆప్యాయతతో రవిలో ఉన్న కరకుదనం కొంతవరకు తగ్గింది.

అట్లా రవి ఒకవైపున చదువుకుంటూనే మరొకవైపున పనికి వెళ్ళటం మొదలైంది. బడికి వెళ్ళిన తర్వాత అతను ఒక్క నిముషం కూడా వృథా చేసేవాడు కాదు- ఖాళీ సమయంలో పని చేసి డబ్బులు సంపాదించేవాడు. కానీ రాత్రి పదకొండు గంటల వరకు కూర్చొని సొంతగా చదువుకునేవాడు.

ఇక తెల్లవారు జామున నాలుగు గంటలకల్లా నిద్రలేచి, గంటసేపు చదువుకొని, బయట ఎక్కడైనా పని దొరికితే పని చేసి, బడికి వెళ్ళేవాడు. అతని శ్రమ ఫలితంగా ఏడోతరగతిలో అతనికి చాలా మంచి మార్కులు వచ్చాయి. పెద్దసర్కాల బడిలో అతనికి సీటుకూడా వచ్చింది! కాని రవి తన పరిస్థితిని చెప్పి, "నేను లేకపోతే మా కుటుంబం గడవదు. కనుక నాకు ఈ సీటు వద్దు" అన్నాడు. కానీ పెద్దసర్కాల బడి మాస్టారు ఊరుకోలేదు. వచ్చి రవి వాళ్ల అమ్మతో మాట్లాడారు- 'మీకు మేమందరం తలా ఇంత సాయం చేస్తాం; మీవాడిని చదవనివ్వు' అని ఊరివాళ్లంతా చెప్పినమీదట, రవి వాళ్లమ్మ అందుకు ఒప్పుకున్నది.

అప్పుడు రవికి తెలిసివచ్చింది- 'కలిసి బ్రతకటంలో బలం ఉంది. కలిసి బ్రతికినప్పుడు, కష్ట సుఖాలను పంచుకున్నప్పుడు మనుషులు దగ్గరవుతారు. ఎవరికివాళ్ళు విడివిడిగా ఉంటే మనసుల్లో దూరం పెరుగుతుంది'. ఆనాటినుండి రవికి ఊళ్ళోవాళ్లంటే ఇష్టం కలిగింది.

పదో తరగతి పరీక్షలు రాసి ఇంటికి వచ్చినప్పుడు ఎదురైన సంఘటన ఒకటి రవిని పూర్తిగా మార్చివేసింది. ఎండాకాలపు సెలవల్లో ఒకరోజు అర్థరాత్రి అందరూ నిద్రపోతున్న

సమయంలో ఎవరి ఇంట్లోంచో మంటలు లేచాయి. మంటకు గాలి తోడవ్వటంతో ఒక ఇల్లు తర్వాత ఒక ఇల్లు అంటుకొనసాగింది.



ఊరంతటా హాహాకారాలు చెలరేగాయి.

యువకులంతా బృందాలుగా ఏర్పడి మంటలను ఆర్పేందుకు పూనుకున్నారు. ఆ ఆపద సమయంలో మంటల్లో ఇరుక్కున్న చాలామంది చిన్నపిల్లలను రవి కాపాడాడు. అంతలో మంటలు రవి వాళ్ల ఇంటికి కూడా వ్యాపించాయి. రవికి ఆ సంగతి తెలిసింది- అయినా అతను చేస్తున్న పనిని విడిచి అక్కడికి పరుగు పెట్టలేదు- ఊళ్ళోవాళ్ళే బాధ్యతగా నీళ్ళు తెచ్చి పోసి రవి వాళ్ళ ఇంటిని కాపాడారు. గాయాలైన రవి వాళ్ల అమ్మని వాళ్ళే ఆసుపత్రికి తీసుకెళ్ళారు. అటు తర్వాత చాలామంది రవి తమకు చేసిన మేలును ప్రశంసించి కృతజ్ఞతలు తెలుపుకున్నారు కూడాను!

తల్లి ప్రేమతో పాటు ప్రజల ప్రేమకూడా గొప్పదని అప్పుడు అర్థమైంది రవికి. స్వార్థం కారణంగా ఉన్న ఊళ్ళోనే ఒంటరిగా బ్రతికిన రవి అలా సమాజంలో ఒకడయ్యాడు; పదిమందిచేతా 'మంచివాడు' అనిపించుకున్నాడు.

## గంధర్వ గానం!

సుబ్బారావు: నిన్న రాత్రి మీరు చేసిన సాయాన్నిఈ జన్మలో మరిచి పోలేనండీ!

రామారావు(ఆశ్చర్యంగా): నేనేం చేశానండీ!?

సుబ్బారావు: రాత్రి మీరు పాడేపాటలు విని, మా బంధువులు పారిపోయారు.

*సేకరణ: ఎన్.వెంకటరమణ, 8వతరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*



# ప్రజల తల్లి



*రచన: జి.హేమలత, 8 వ తరగతి B, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా.*

వర్థనుడు అనే రాజుకు ఒక్కతే కూతురు- చంద్రిక. చంద్రికకు పదేళ్ళు. చాలా అందంగా వుంటుంది. చాలా మంచి అమ్మాయి- అందరితోనూ చాలా స్నేహంగా, కలిసి మెలిసి ఉంటుంది. ఒక రోజు ఆమె, ఆమె స్నేహితులు అందరూ కలిసి అడవికి వెళ్ళారు. వాళ్లకు తోడుగా కొందరు భటులు కూడా వెళ్ళారు. అక్కడ అడవిలో అందమైన చెట్లు,పూలు, ఏర్లు, కొలనులు చాలా కనిపించాయి. పిల్లలందరూ చాలా ఉత్సాహపడ్డారు. బాగా తిరిగారు; వెళ్ళి పువ్వులు కోసుకున్నారు.

ఇట్లా చాలా సమయం గడిచాక, "చంద్రికా! సాయంత్రం అవుతున్నది; మబ్బులు కూడా కమ్ముకుంటున్నాయి. మనం మన ఇళ్ళకు చేరుకుందాం పద" అన్నారు స్నేహితులందరూ. భటులు కూడా తొందర

పెట్టారు. అయినా చంద్రిక మాత్రం "వస్తాను, వస్తాను" అంటూనే అడవి లోలోపలికి అడుగులువేస్తోంది. అక్కడ ఆమెకు కొత్తగా కనిపించిన మంచి మంచి పూలు ఆమెను వెనక్కి లాగుతున్నాయి. అటు ఈదురు గాలులూ పెరుగుతున్నాయి. నేస్తాలకీ, భటులకు ఏం చెయ్యాలో పాలుపోవడం లేదు. చంద్రిక రాజుగారి కూతురాయె! ఆమెను కాదని ఏం చేయగలరు?

అంతలో ఒక పొదలచాటు నుండి "గుర్ర్.." మని పులి గాండ్రింపు వినబడింది. భటులు బాణాలు ఎక్కుపెట్టేంతలో పెద్దపులి ఒకటి వాళ్ళ మీదికి దూకనే దూకింది. భటులు, పిల్లలు అందరూ చెల్లా చెదరు అయ్యారు. పులి మటుకు వాసన చూసుకుంటూ చంద్రిక వెళ్ళిన దిశలోనే పరుగు తీసింది.

అట్లా తనవైపుకు వచ్చిన పులిని చూడగానే చంద్రికకు ఏం చేయాలో తెలీలేదు. తనుచిన్నప్పుడు చదివిన కథలలో పెద్దపులుల నుండి తప్పించుకున్న రాజకుమార్తెల కథనొకదాన్ని గుర్తు చేసుకొని, చంద్రిక గబగబా ఒక పెద్ద చెట్టు పైకి ఎక్కి కూర్చున్నది. అంతలోనే పెద్ద వాన మొదలైంది. పులికూడా చంద్రిక వెనకనే చెట్టు ఎక్కుదామని ప్రయత్నించింది గానీ, అది వీలవ్వలేదు... దానిది భారీ కాయమాయె!

దాంతో పులి "పోనీలే! ఇన్నాళ్ళకి మంచి ఆహారం ఒకటి నా కంట పడింది. ఈ పిల్ల ఎక్కడికి పోతుంది? ఎప్పటికైనా క్రిందికి దిగక తప్పదు. అప్పుడు తింటానులే, నేను! దానిదేముంది?!" అనుకొని అక్కడే కాపుకాసింది.

ఇక అక్కడ భటులందరూ చాలా ఆందోళన పడ్డారు. చంద్రిక స్నేహితులందరినీ వారి వారి ఇళ్లకు చేర్చి వచ్చి, వానలోనే అడవంతా వెతకటం మొదలు పెట్టారు. అయినా ఏమైందో మరి, ఒక్కరు కూడా చంద్రిక ఉన్న చెట్టు వైపుకు రాలేదు!

ఇట్లా చంద్రిక, పులి ఇద్దరూ ఒకరాత్రి, ఒక పగలు ఒకరి కోసం ఒకరు కాపు కాశారు. చివరికి పులి నిరాశపడింది. ఆకలే గెలిచింది. "ఇదేదో దొరికేట్లు లేదు. నేను ఇక వేరే ఆహారం

చూసుకుంటాను" అని అది వెళ్ళిపోయింది.

అయితే ఆసరికి చంద్రికకు బాగా నిద్ర పట్టింది. ఆ పాప చాలా నీరసపడ్డది కూడానూ. ఆరోజు రాత్రి అలా నిద్రపోతున్న చంద్రిక కాస్తా రపాలున క్రింద పడిపోయింది. అయితే ఆ పాపకు ఆ సంగతే తెలీనేలేదు! -పాపం, అక్కడ వున్న పెద్దరాయి ఒకటి చంద్రిక తలకి తగిలింది! ఆమె అలా అక్కడే స్పృహ తప్పిపోయి పడి ఉన్నది, రాత్రంతా.

తెల్లవారు ఝామున ఏమైందంటే, ఒక ముసలి అవ్వ కట్టెలు కొట్టటానికి అడవికి వచ్చింది. అక్కడ పడివున్న చంద్రికను చూసి దగ్గరకు వెళ్ళింది. "ఎవరో ఇంత చిన్న పిల్ల! పాపం, తలకి చాలా పెద్దగాయం తగిలింది. ఎవ్వరూ లేరనుకుంటాను తనకు!" అని చంద్రికను లేపి మెల్లగా తన ఇంటికి తీసుకువెళ్ళింది. ఆ పాపను పడుకోబెట్టి, తలకు కట్టుకట్టి, మొహానికి నీళ్ళు చల్లి, జాగ్రత్తగా చూసుకున్నది.

రెండు రోజుల తర్వాతగానీ చంద్రికకు తెలివి రాలేదు. వచ్చాక కూడా ఆమెకు తలంతా దిమ్ముగా అనిపించింది. తన పేరు చంద్రిక అని తెలుస్తూనే ఉంది-కానీ మిగతా సంగతులేవీ ఎంత ఆలోచించినా గుర్తుకు రావటం లేదు ఆమెకు!



చంద్రిక లేచి తిరగటం మొదలుపెట్టాక అవ్వ అడిగింది- "పాపా! నువ్వు ఎవరు? ఎక్కడ ఉంటావు? నీ తల్లిదండ్రులు ఎవరు?" అని. చంద్రికకు గుర్తు వస్తే గద! అప్పుడు చంద్రిక ఎంతో మర్యాదగా అన్నది- "బామ్మా! నేను ఎంత ఆలోచించినా నా గతం గుర్తురావటం లేదు. కానీ నాపేరు చంద్రిక అని మటుకు

గుర్తున్నది" అని. "సరేలేమ్మా, నువ్వు ఎవరో తెలిసేదాకా నువ్వూ నాతోబాటే ఇక్కడ ఉండచ్చు; కానీ ఒక సమస్య ఉన్నది.." అన్నది అవ్వ.

చంద్రికకు అవ్వ నచ్చింది. అదీగాక, తనకు ఏవో సంగతులు గుర్తుకు రావట్లేదని తెలుస్తూనే ఉన్నది- అవి గుర్తుకు రావాలంటే కొంత సమయం వదలాలి.." ఏం సమస్యో చెప్పవ్వా!" అన్నది.

"నువ్వు కూడా కష్టపడి పని చెయ్యాల్సి ఉంటుంది. ఏమంటే, నేను చాలా ముసలి దాన్ని అయిపోయాను కదా- ఎక్కువ పని చేయగల శక్తి లేదు నాకు. నా రెక్కల కష్టం మీద నా ఒక్కదాని జీవితం గడవడమే చాలా కష్టం అవుతున్నది. ఇంక నీకు తిండి ఎక్కడినుండి తెస్తాను? అందుకని, నేను రోజూ ఎలాగో ఒకలాగా కట్టెలు ఏరుకొస్తాను. నువ్వు ఊళ్లో కెళ్ళి రోజూ ఇన్ని కట్టెపుల్లలు అమ్ముకొని రావాలి. వాటితో ఇంత బియ్యం కొనుక్కొచ్చావంటే, ఆ పూటకి మనం వాటిని వండుకొని తినచ్చు- ఏమంటావు చంద్రికా?" అంది బామ్మ.

"బామ్మా! నేను ఎవరినో తెలియకపోయినా నాకు ఇక్కడ చోటు ఇచ్చావు. ఈ మాత్రం పని చేయటం నాకు కష్టమేమీ కాదు. అలాగే చేద్దాం. నువ్వు పుల్లలు ఏరుకురా, నేను వాటిని అమ్ముకొస్తాను. నువ్వు చెప్పినట్లే చేద్దాంలే" అన్నది చంద్రిక.

రాజుగారి గారాల బిడ్డగా ఏ కష్టమూ ఎరగకుండా పెరిగిన చంద్రిక ఇలా ఆరు నెలలు గడిపింది.

అక్కడ రాజుగారు చంద్రికకోసం వెతికించని కొండలేదు; కోనలేదు. అందరూ అన్నారు-"యువరాణి పులి బారిన పడ్డది" అని. రాజు, రాణి మటుకు అట్లా జరగలేదని నమ్మారు. కానీ ఎంత వెతికినా ప్రయోజనం లేకపోయింది. యువరాణి చంద్రిక ఎవరికీ కనబడనే లేదు.

ఒకరోజు చంద్రిక కట్టెలమ్ముకుంటూ రాజవీధిలోకి పోయింది. చిత్రంగా అక్కడ ఉన్నవన్నీ తనకు చాలా పరిచయం ఉన్న వాటిలాగా అనిపించ సాగాయి ఆమెకు.

అందుకని ఆమె తను తెచ్చిన కట్టెపుల్లలను ఒక ప్రక్కన పెట్టి, అటూ ఇటూ వింతగా చూస్తూ పోసాగింది. అంతలోనే రాణిగారి పరిచారికలూ చంద్రికను చూసి ఆశ్చర్యపోయారు: అప్పటికే పౌష్టికాహారలోపం వల్ల చంద్రిక చాలా సన్నగా అయిపోయింది. ఆమె చర్మం ఎండ కారణంగా నల్లగా కమిలిపోయి ఉన్నది. ఆమె మొహం కూడా చాలా మారిపోయింది. అయినా ఆమెను గుర్తుపట్టిన పరిచారికలు చంద్రికను రాజు దగ్గరికి తీసుకెళ్ళారు.

"అయ్యా! నన్ను ఇక్కడికి ఎందుకు తీసుకువచ్చారు?" అని రాజుని అడిగింది చంద్రిక.

ఆ పాప గొంతు వినగానే రాజుకు, రాణికి అర్థమైంది- "ఇది వేరెవరో కాదు- తమ బిడ్డే!" అని.

"నీ పేరేమిటి పాపా?" అని అడిగారు రాజుగారు.

"చంద్రిక!" అని జవాబు ఇచ్చింది పాప.

"నువ్వు ఎక్కడ ఉంటున్నావు, చంద్రికా? నీ వాళ్ళు ఎవరు?" అని అడిగి, రాజుగారు తక్షణం భటుల్ని పంపారు- అవ్వను పిలిపించుకున్నారు. అవ్వ ద్వారా ఆయనకు చంద్రికను గురించిన విషయాలన్నీ తెలిసాయి.

చివరకు ఆ పాప తన కూతురేనని స్పష్టమైంది. "నిన్నిలా మళ్ళీ చూస్తాం అనుకోలేదు!" అని కన్నీళ్ళు పెట్టుకున్నారు రాజుగారు. "రామ్మా! ఇంత కాలానికి మా మనస్సులు చల్లబడ్డాయి. చాలా సంతోషంగా ఉంది. రా, మనం లోపలికి వెళ్దాం, పద!" అన్నారు రాణిగారు.

చంద్రిక కొద్ది సేపు నిశ్శబ్దంగా నిలబడి, అన్నది- "నాకు కూడా తల్లి దండ్రులు ఉన్నారని తెలిసి చాలా సంతోషంగా ఉంది నాన్నగారూ! కానీ నా తలకు గాయం తగిలినప్పటి నుండీ నేనెవ్వరో తెలీకపోయినా ప్రాణంతో సమానంగా చూసుకున్నది అవ్వ. అట్లాంటి మా అవ్వని వదిలి నేను రాలేను- క్షమించండి" అన్నది.

సరిగ్గా అదే సమయానికి చంద్రికకు తన రాచరిక జీవితం మొత్తం గుర్తుకు వచ్చింది.

అయితే దానితోపాటు బొమ్మలాంటి సాధారణ ప్రజల కష్టాలు కూడా ఆ పాప కళ్ళ ముందు కదలాడాయి.

అంతలో రాజుగారు అన్నారు-"చంద్రికా! అడవిలో ఉన్న అవ్వను కూడా ఇక్కడకే తెద్దాం" అని.

చంద్రిక నవ్వింది. "నాన్నగారూ! వ్యక్తులుగా ఎంతమందికి సహాయం చేయగలం? ఒక అవ్వకు సాయం చేస్తే సరిపోతుందా? మన రాజ్యంలో మామూలు మనుషులు అనుభవిస్తున్న కష్టాలను కళ్ళారా చూసాక, మన వైభోగం ఎవరి భిక్షో అర్థమైంది నాకు. కష్టపడి, కడుపు కొట్టుకొని బతుకుతున్న వారి బతుకుల్ని బాగుచెయ్యలేని పాలన ఎందుకు?" అంది గట్టిగా.

రాజుగారికి ఆశ్చర్యంతో, ఆనందంతో నోటమాట రాలేదు. చంద్రికను అక్కున చేర్చుకొని "తల్లీ! నువ్వు సంపాదించిన ఈ అనుభవం సామాన్యమైనది కాదు. పరిపాలనలో ఉన్నవాళ్లకు మామూలు ప్రజల కడగండ్లు అనుభవంలోకి రావటం చాలా అవసరం తల్లీ! అప్పుడే 'ప్రజలరాజు'లు తయారయ్యేందుకు వీలు ఏర్పడుతుంది. నీ ఈ అనుభవాన్ని వృధా పోనివ్వను. రా తల్లీ, పరిపాలనలోని మెళకువలు నేర్చుకో, ప్రజల రాణివి అయ్యేవు త్వరలో!" అని దీవించాడు.

అనతికాలంలోనే చంద్రిక రాచవిద్యలు అన్నింటిలోనూ ఆరితేరింది. రాజుగారి తర్వాత తనే పాలకురాలైంది. ప్రజల జీవితాల్ని దగ్గరగా చూసిన చంద్రిక, ఇప్పుడు రాణియై రాజ్యంలో చక్కని పాలనని ప్రవేశపెట్టింది. అందరిచేతా 'ప్రజలతల్లి' అని అనిపించుకున్నది. రాజ్య సంక్షేమానికే తన జీవితాన్ని అంకితం చేసింది. ప్రజలలోనే తన కుటుంబాన్ని చూసుకొంటూ జీవించింది!



# ఫల ప్రదం

*రచన; ద్రోణంరాజు వెంకటసుబ్బారావు, సంస్కృత ఉపాధ్యాయులు, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా.*

"విశాఖపట్టణం నుండి పలాసపోవు ప్యాసింజర్ మరికొద్దిసేపట్లో 5 వనెంబర్ ప్లాట్‌ఫాం నుండి బయలు దేరుటకు సిద్ధంగా ఉంది" అని మైకులో వినబడుతుంటే రాం నాథం మాస్టారు గబగబా పరుగెత్తి వెళ్ళి రైల్లో కూర్చున్నారు. రాంనాథంగారు రిటైర్ అయిన సంస్కృత ఉపాధ్యాయుడు. విజయనగరం మహారాజా వారి సంస్కృత కళాశాలలో పనిచేసారు; ఎందరో విద్యార్ధులకు విద్య గరపారు. మంచికి మారుపేరుగా అందరూ చెప్పుకుంటారు ఆయన్ని గురించి. ఎందరో పేద విద్యార్థులకు చేయూత నందించిన వ్యక్తిత్వం ఆయనది.

రైలు వేగం మెల్లమెల్లగా పెరుగుతుంటే ఆయన మనసు గతం లోకి పరుగులు పెడుతోంది. చాలా రోజుల తరువాత తన పుట్టినూరికి వెళ్తున్నాడు. తమ ఊరి పొలాలు, చెరువు గట్టు, శివుడి కోవెల, తను చదివిన బడి.. అన్నీ

గుర్తొస్తున్నాయి. తన చిన్ననాటి తెలుగు మాస్టారు చెప్పిన "చేసిన మేలు ఊరకన్ పోదు" అనే మాట ఇప్పటికీ చెవుల్లో వినబడుతోంది. ఆ మాటే తనని ఉన్నతమైన వ్యక్తిగా సమాజంలో నిలబెట్టింది..

రైలు విజయనగరం చేరుతోంది. ఎవరో భిక్షగాడు "జీవము నీవే కదా..దేవా" అని పాడుకుంటూ వస్తున్నాడు. రాంనాథం గారు ఒక ఐదు రూపాయల బిళ్ళ అతని చేతిలో పెట్టారు.

రైలు విజయ నగరంలో ఆగింది. రాంనాథం గారు ఓమాటు రైలు దిగారు. ఆ రోజు దినపత్రిక కొని, మళ్లీ రైలెక్కారు. పేపరు చదువుతుండగా వినబడింది- "టికెట్ టికెట్" అని. తల త్రిప్పి చూశారు. ఎదురుగా రెండుమూడు వరసల ముందునించి టికెట్‌లు తనిఖీ చేస్తూ వస్తున్న అధికారి కనబడ్డాడు. రాంనాథం గారు లేచి నిల్చున్నారు. టికెట్ తీసుకుందామని తన లాల్చీ జేబులో చెయ్యిపెట్టారు. జేబు ఖాళీగా చేతికి తగిలింది! మాస్టారుగారికి దిక్కు తోచలేదు. "పర్సు ఏమైంది?! తన పర్సులోనే పెట్టుకున్నాడే, డబ్బులు- టికెట్ కూడానూ?! పర్సు జేబులో లేదు!" రెండు జేబులూ తడుముకొని చూసుకున్నాడు- రెండూ ఖాళీనే!

"దేవుడా, ఏం చేసేది?.. టికెట్ లేదు; డబ్బులు లేవు. వెళ్లేది అమ్మాయి పెండ్లికి!" రాంనాథం గారికి కళ్లు బైర్లు కమ్ముతున్నాయి. 'టికెట్...టికెట్..' శబ్దం ముందుముందుకు వస్తోంది.

'నాకు ఎప్పుడూ ఇలాంటి పరిస్థితిరాలేదు: ఈ వయస్సులో ఇంతమంది ముందు దోషిగా నిలబడతానే, ఏం చేసేది?" రాంనాథం గారి మనసు పరిపరివిధాల పోతోంది.. "విజయనగరంలో దిగి పేపరు కొన్నాను.. గాబరాగా పర్సు జేబులో పెట్టుకొని రైలెక్కేసాను.. బహుశా అప్పుడే అది బయట పడిపోయి ఉంటుంది..ఇప్పుడెలాగ?" రాంనాథంగారి కళ్ళు మూసుకుపోయాయి.

"టికెట్..టికెట్..." శబ్దం మరింత దగ్గరకు వచ్చింది.. తన ఎదురుగా ఉన్నవాళ్లని

ప్రశ్నిస్తోంది.. రాంనాథం గారికి చెమటపడుతోంది..

"ఇప్పుడు ఏం చేయాలి? చేతిలో నయాపైసా అయినా లేదు.. తెలిసిన వాళ్ళుకూడా ఎవరూ లేరు ఈ రైల్లో.." రాంనాథం గారు తలవంచుకుని కూర్చున్నారు. "టికెట్.. టికెట్.." శబ్దం తన పక్క వారిని ప్రశ్నిస్తోంది..



'పరీక్షలో జవాబులు తెలియని ప్రశ్నలకు సమాధానాలు రాసే విద్యార్థిలాగా' ఉంది రాంనాథం గారి పరిస్థితి. "జీవితంలో ప్రతివాడూ ఎల్లప్పుడూ విద్యార్థే.." తాను పిల్లలకు చెప్పిన మాటలు తనకు ఇప్పుడు గుర్తొస్తున్నాయి.."తనూ ఇప్పుడో 'అర్థే'.." రాం నాథం గారు ముడుచుకు పోతున్నారు..

"ఏమండీ.. మీ టికెట్ చూపిస్తారా?" ఆ గొంతు తననే ప్రశ్నిస్తోంది.. రాంనాథం గారు తటాలున లేచి నిల్చున్నారు. అతని వేపు చూసారు.. ఒక్క క్షణం నిశ్శబ్దం..

ఏం చెప్పాలో పాలుపోలేదు..

"ఏమని చెప్పను?.. టికెట్ లేదనేదా?.. నన్ను జైల్లోపెట్టమనేదా?.."

రైల్వే అధికారి ఏదో అంటున్నారు.. రాంనాథంగారికి అది సగం సగమే వినబడుతున్నది.. "నమస్కారం మాస్టారూ, నేను మీ దగ్గర చదువుకున్న గోపాల్‌ని. గుర్తున్నానో లేదో.. నాకు మీరు చాలా సార్లు సాయం చేసారు. విజయనగరంలో రైలు ఎక్కబోతుంటే నాకు ఒక పర్సు దొరికింది. 'ఎవరిదా' అని చూస్తే దానిలో మీ ఫోటో ఉంది.. అక్కడినుండీ నేను మీ కోసమే వెతుక్కుంటూ వస్తున్నాను. ప్రస్తుతం రైల్వేలో టి.టి.యీగా పనిచేస్తున్నాను మాస్టారూ. ఇంతకాలం తర్వాత మిమ్మల్ని కలుస్తున్నందుకు చాలా సంతోషంగా ఉంది .. ఇదిగోండి, మీ పర్సు తీసుకోండి.. ఇందులో

టికెట్ కూడా ఉంది" అని పర్సు అందించి, రాంనాథం గారికి గౌరవంగా నమస్కరించాడు గోపాల్.

రాంనాథం గారి సంతోషానికి అవధులు లేవు. తన పర్సు దొరకడం ఒక వంతు అయితే, తన విద్యార్థి ప్రయోజకుడై తన ముందు నిలబడి ఉండటం మరొకటి. రాంనాథంగారు ఆలోచనల్లో ఉండగానే గోపాల్ చెబుతున్నాడు.. "మీరు మాకు ఎన్నో నీతి శ్లోకాలు చెప్పారు, అందులో ఒకటి ఇప్పటికీ గుర్తుంది:

'*యథాబీజాంకుర: సూక్ష్మ:*

*ప్రయత్నేన అభిరక్షిత: ।*

*ఫలప్రదో భవేత్ కాలే-*

*తద్వల్లోకో సురక్షిత: ॥*

విత్తనం నుండి వచ్చిన మొలక చాలా చిన్నది. అయినా దానిని మనం నీరుపోసి జాగ్రత్తగా రక్షిస్తే, అది పెరిగి పెద్దదై సరైన సమయంలో మనకు ఫలాలను అందిస్తుంది. ఈ లోకం కూడా అలాంటిదే. మనం తోటి వారికి చేసిన సాయం వృధా పోదు. ఏదో ఒకనాడు అది మనకు సహాయమై తిరిగి వస్తుంది..' అని మీరు ఎన్నోసార్లు చెప్పారు. మేము మీ దగ్గర పెరిగిన పూల మొక్కల లాంటి వాళ్లమేనండీ, నిజంగా.

నేను విజయనగరంలోనే ఉంటున్నాను. ఇదిగోండి, నా ఫోన్ నంబరు. ఈ సారి మీరు మా ఇంటికి తప్పకుండా రావాలి. వచ్చే ముందు ఫోన్ చెయ్యండి; నేను వచ్చి మిమ్మల్ని మా ఇంటికి తీసుకెళ్తాను. వస్తానండీ!" అంటూ గోపాల్ వచ్చినంత చురుకుగానూ ముందుకు వెళ్లిపోయాడు.

రాంనాథం గారి కళ్ల నుండి రెండు అశ్రు బిందువులు రాలాయి.

రైలు ముందుకు పోతూ ఉంది..

*యథాబీజాంకుర: సూక్ష్మ: ...*

ఎంత లోతుగా ఆలోచించి చెప్పారు, పెద్దలు!




# నడిచే గ్రంథాలయం



*రచన: పి.మోహనరావు, ఉపాధ్యాయులు, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*

అది జనవరి ఒకటో తేదీ. దేశమంతా ఆనందోత్సహాలతో న్యూ ఇయర్ వేడుకల్ని జరుపుకుంటోంది. పాశ్చాత్య సంప్రదాయాన్ని మనం ఎందుకు ఆచరించాలో తెలియని పిచ్చివాళ్ళ ఆనందం అంబరాన్నంటుతోంది. కానీ ఇవేమీ మోహన్‌కి పట్టడంలేదు- అతను పొందుతున్న సంతోషం అంతకంటే ఎక్కువే. తాము కొత్తగా కట్టిన గ్రంథాలయ భవనాన్ని అలంకరిస్తున్నాడు అతను.

"మోహన్! ఈ రోజే కదా, మన ఊళ్ళో గ్రంథాలయం ప్రారంభమయ్యేది?" అన్న మాటలకి మోహన్ అటు తిరిగి చూశాడు. ఎదురుగా గోవింద్, తన బాల్య స్నేహితుడు. వాడిలో ఏ మార్పూ లేదు- అదే ఎత్తు, అదే పలకరింపు!

"గోవింద్!" తన ఆలోచనల నుండి

బయటపడి పలకరించాడు మోహన్. "బావున్నావా? ఏంచేస్తున్నావు? ఇన్నేళ్ళుగా కనబడనే లేదు! ఎట్లా ఉన్నావు, ఏమేం చేశావు?" అడిగాడు ఏకబిగిన.

గోవింద్ నవ్వాడు. "బాగున్నాను బాగున్నాను. సివిల్ సర్వీసు పరీక్షలు రాసి ప్రభుత్వంలో అధికారినయ్యాను. మన ఊరి సంగతులు తెలుసుకుంటూనే ఉన్నాను. ఇవాళ్ల గ్రంథాలయం మొదలు పెడుతున్నారని తెలిసి, మిమ్మల్నందరినీ చూసినట్లు ఉంటుందని వచ్చాను. మనలాంటి వారినెందరినో తీర్చి దిద్దిన వేణు మాష్టారి పేరుతో గ్రంథాలయాన్ని ఏర్పాటుచేయటం నాకు చాలా నచ్చింది. నావరకూ నేను ఆయన్ని తలచుకోని రోజే లేదు. నా వంతుగా, ఇదిగో- ఈ జీపునిండా పుస్తకాలు, వాటిని అమర్చిపెట్టేందుకు రెండు అలమారలు తీసుకొచ్చాను, మన గ్రంథాలయం కోసం" అంటూ గోవింద్ కూడా గ్రంథాలయ భవనపు అలంకరణలోకి దిగాడు.

'చక్కని బోధన, ఆచరణ, ఆలోచనారీతి, ప్రేమ, స్నేహం, ఓదార్పు, ప్రోత్సాహం'- అనే అమృతధారల్ని శిష్యకోటి పై కురిపించిన గొప్ప మనిషి వేణు మాస్టారు. తను నేర్పిన సంగతులను తన శిష్య బృందం కూడా పదిమందికీ పంచేట్లు మలచిన గొప్ప శిల్పి ఆయన. అక్షర జ్ఞానాన్ని మాత్రమే నేర్పే సగటు ఉపాధ్యాయుడు కాదు- సామాజిక చింతనను కూడా అందించి, సొంత లాభాన్ని ప్రక్కన పెట్టి తోటి వారికి తోడ్పడేట్లుగా దేశభక్తి వైపు నడిపించిన నిజమైన గురువు ఆయన.

వేణు మాస్టారు చాలా పుస్తకాలను చదివేవారు. అంతేకాదు, 'పుస్తకాలు చదవటం మంచిది' అని నమ్మేవారు. పిల్లలందరికీ పుస్తకాలు చదవటంలోని మాధుర్యాన్ని రుచి చూపించాలని శ్రమించేవారు. తన గ్రామానికి ఒక శాశ్వత గ్రంథాలయం కావాలని తపించి పోయేవారు ఆయన. కానీ కాలం కలిసిరాలేదు- పచ్చకామెర్ల వ్యాధికి గురయ్యారు వేణు మాష్టారు- అది చివరికి మాస్టారు గార్ని పొట్టన పెట్టుకుంది. ఇన్నాళ్లకు ఆయన కన్న కల నిజం కావస్తున్నది- గ్రామంలో శాశ్వత గ్రంథాలయం ఒకదాన్ని ఏర్పాటు

చేస్తున్నారు ఆయన శిష్యులు..

"మన మాష్టారి కలల్ని విద్యార్థిగా నువ్వు నిజం చేశావన్నమాట" పనులు చేస్తూనే మాట కలిపాడు గోవింద్.

మోహన్, గోవింద్‌లు చిన్నతనంలో పుస్తకాల కోసం బాగా గొడవచేసుకునేవారు. అదే వారి స్నేహానికి దారితీసింది; ఇద్దర్నీ పుస్తకప్రేమికుల్ని చేసింది; పుస్తకాలు చదివే అలవాటుని మరింత మందికి కలిగించే దిశగా కదిలించింది.

"ఏం లేదురా, మన తోటి విద్యార్థులందరి ఇష్టం, గ్రామస్తుల సహకారం కారణంగా ఈ గ్రంథాలయం ఏర్పడుతున్నది" అందరి సేవనూ గుర్తిస్తూ అన్నాడు మోహన్.

"ఏది ఏమైనా ఒకనాటి సంచార గ్రంథాలయం నేడు శాశ్వత గ్రంథాలయంగా మారింది. నీ కృషిని అభినందించకుండా ఉండలేక-పోతున్నాను" అంటూ మోహన్ భుజంపై చేయివేసి అభినందన పూర్వకంగా చూశాడు గోవింద్.

అంతలో వచ్చారు రాజు, రాము-"ఔను, మోహన్ తాను అనుకున్నది సాధిస్తాడు" అంటూ.

రాజు, రాము కూడా వేణు మాస్టారి శిష్యులే. రాజు ఒక ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్నాడు. రాము ప్రభుత్వ ఉద్యోగి.




వీళ్లంతా నిరుద్యోగులుగా ఉన్నప్పుడు ఒకటే పుస్తకాలు చదివేవాళ్ళు. వీళ్లతో పాటు ప్రక్కల గ్రామాల ప్రజలందరిచేతా విరివిగా పుస్తకాలు చదివాలని, వేణు మాస్టారు ఆ రోజుల్లో ఒక ప్రణాళికను రచించారు. అదే 'సంచార గ్రంథాలయం'.

మోహన్‌కి ఒక పాత అట్లాస్ సైకిల్ ఉండేది. సమయం చిక్కినప్పుడల్లా మిత్రులు నలుగురూ ఆ సైకిల్‌మీద పత్రికలు, పుస్తకాలను పెట్టుకొని తిరిగేవాళ్ళు.

సాయంకాలం వేళల్లో రోజుకో గ్రామం చొప్పున తిరిగేవాళ్ళు. పాఠకుల నుండి నామ మాత్రపు అద్దె డబ్బుల్ని వసూలు చేసేవాళ్ళు. వాటితో మరిన్ని కొత్త పుస్తకాల్ని కొనేందుకు వీలయ్యేది. మోహన్‌కి ఉద్యోగం వచ్చాక ఆ పనికొంచెం కుంటుపడింది. వేణు మాస్టారు వెంటనే ఆ బాధ్యతల్ని వేరే పిల్లలకు ఇచ్చారు.

"భలే ఉండేవిరా, ఆ రోజులు! సైకిల్ మీద ఊరూరూ ఎట్లా తిరిగామోగానీ, ఇప్పుడు ఆ సంగతి తలచుకుంటే భలే అనిపిస్తుంది" అన్నాడు గోవింద్.

"అవునురా, దానివల్ల మనకు ఖర్చు లేకుండా పుస్తకాలు దొరికాయిగా, చదువుకు-నేందుకు? ఎంత లాభం జరిగిందో ఊహించలేం! పిల్లలందరికీ పుస్తకాలు దొరికేట్లు చేయటం గొప్ప పనిరా! నిజంగా 'పుణ్యం-పురుషార్థం అంటే ఇదే' అనిపిస్తుంది!" అన్నాడు రాజు.

"మనం నడిపిన సంచార గ్రంథాలయాన్ని ఉపయోగించుకోవటం వల్లే వాసుదేవరావుకు 'మండల అభివృద్ధి అధికారి' ఉద్యోగం వచ్చిందట! వాడికి కూడా మనకున్న పుస్తకాల పిచ్చి అంటిందని చాలా సంతోషంగా ఉంది నాకు" నవ్వుతూ చెప్పాడు గోవింద్.

"ఔను, ఈ రోజు ఈ గ్రంథాలయాన్ని ప్రారంభించటానికి వస్తున్నది కూడా తనే" పుస్తకాలను వరుస క్రమంలో సర్దుతూ చెప్పాడు రాము.

"అదిగో మాటల్లోనే వచ్చాడు వాసు" అందరి దృష్టినీ మరల్చుతూ చెప్పాడు మోహన్. అందరూ అటుగా చూశారు. కారు దిగి అందరినీ పలకరిస్తూ వచ్చి, గోవింద్‌ని చూడగానే చకితుడయ్యాడు వాసు- "కలెక్టరుగారు! ఈ సమయంలో మీరు ఇక్కడికి రావటం మా ఊరు చేసుకున్న భాగ్యం!" అన్నాడు.

గోవింద్ నవ్వాడు. "ఊరుకోరా, నేను ఇక్కడికి కలెక్టరుగా రాలేదు. ఒకప్పుడు సైకిలు మీద ఊరూరా తిరిగి, అందరితో బాటు నీకు కూడా పుస్తకాలు అద్దెకిచ్చిన గోవిందుగా వచ్చాను!" అన్నాడు.

తమ జిల్లాకి కొత్తగా వచ్చిన కలెక్టరు

గోవిందేనని అప్పటివరకూ తెలియని మిత్రులంతా ఆశ్చర్యంతో వెర్రి మొఖాలు వేశారు.

ఆనాడు గ్రంథాలయ ప్రారంభోత్సవానికి ఊరు ఊరంతా తరలి వచ్చింది. " 'రైతులకు చదువెందుకు, కూలి పనికి పుస్తకాలెందుకు?' అనుకోకండి. కత్తి చెయ్యలేని పనిని కలం చేస్తుందని మరువకండి. మేమందరం, పుస్తకాలు చదివి బాగుపడ్డాం. పుస్తకాలవల్ల మాకు కేవలం చదువే కాదు; ఉద్యోగాలే కాదు- ప్రపంచం దొరికింది. అందరికీ అలాంటి అవకాశం ఉండాలని, ఇదిగో- ఈ లైబ్రరీ మొదలవుతున్నది. దీన్ని బాగా ఉపయోగించుకోండి. తరతరాలకీ మంచిపుస్తకాలను అందించండి" అని వక్తలంతా ఉద్బోధించారు.

మామూలు రైతు కుటుంబాల్లో పుట్టి, చదువుపట్ల శ్రద్ధవహించి, సంచార గ్రంథాలయాన్ని ఉపయోగించుకొని ప్రయోజకులైన ఆ పిల్లల్ని చూసిన గ్రామస్తులకు గ్రంథాలయం పట్ల, దాని ఉపయోగం పట్ల ఆసక్తి ఇనుమడించింది. గ్రంథాలయాన్ని మరింత అభివృద్ధి చేసేందుకు ఎంతో మంది దాతలు ముందుకు వచ్చారు. కొందరు పుస్తకాలను, మరికొందరు విరాళాలను అందజేశారు.

అందరి సహకారంతో ఆ ఊరి గ్రంథాలయం గొప్పగా నడిచింది. ఎందరెందరు ఆ లైబ్రరీలో చదువుకొని గొప్పవాళ్లయ్యారో లెక్కలేదు. వేణు మాస్టారి కల- ఆలస్యంగానైతేనేమి, ఫలించింది! సంచార గ్రంథాలయం కాస్తా నడిచే గ్రంథాలయం అయ్యింది!

మంచి పుస్తకం, మంచి తోడు!




# హితోపదేశం

*రచన: బి. సూర్యనారాయణ, విశ్రాంత ఉపాధ్యాయులు, పూర్వ విద్యార్థి, టెక్కలి.*

రెండువేల సంవత్సరాల క్రిందటి మాట. అశోక చక్రవర్తికి విపరీతమైన రాజ్యకాంక్ష ఉండేది. దురాశ కొద్దీ ఆయన చిన్న రాజ్యమైన కళింగపై దండెత్తాడు.

అయితే ఆయన ఊహించనంత పెద్ద యుద్ధం జరిగింది. కళింగవీరులు ఎందరో రాజ్య రక్షణ కోసం ప్రాణాలు ధారపోసారు తప్ప ఓటమిని మాత్రం అంగీకరించలేదు. ఆ వీరయోధుల రక్తం ఏరులై ప్రవహించింది. యుద్ధభూమి మొత్తం కళేబరాలతో నిండిపోయింది. అవయవాలు తెగి పడి ఉన్నాయి- నెత్తురు మడుగులు...

ఇదంతా చూసిన అశోకుడు ఆలోచనలో పడ్డాడు. "తను చేసింది తప్పు" అన్న ఆలోచన అతనిలో మొదలై, మెల్లగా అతని హృదయాన్ని దహింపజేసే భయంకర జ్వాలగా మారింది.

ఆనాటి యుద్ధంలో కళింగరాజ్యపు స్త్రీపురుషులు ప్రదర్శించిన స్థైర్యం అశోకుడిని విచలితుడ్ని చేసింది. అతనిలో వేదన మొదలైంది. కళింగ రాజ్యాన్నే కాదు; తాను జయించిన ప్రతి రాజ్యాన్నీ స్వతంత్రంగా విడచి పెట్టాలని నిశ్చయించుకున్నాడు. బుద్ధ భగవానుడి బోధనల సారం ఏమిటో అతనికి కొద్ది కొద్దిగా అర్థమౌతున్నట్లు అనిపించింది.



గుండెనిండా వేదనతో యుద్ధ భూమిలో తిరగటం మొదలు పెట్టాడు-

అక్కడ ఒక చెట్టు క్రింద కూర్చొని కనబడింది ఒక ముసలమ్మ. ఆమె జుట్టు రేగిపోయి ఉన్నది. కళ్ళు ఎర్రగా వాచి ఉన్నాయి. భయంకరమైన గొడ్డలిని ఒకదాన్ని రాతి పైన రంగరిస్తూ పదునుపెడుతున్నదా క్రోధ మూర్తి. ఆమె దగ్గరికి వెళ్ళి అడిగాడు అశోక చక్రవర్తి-

"అవ్వా! ఏంచేస్తున్నావు? యీ వయస్సులో, యీ ఎండలో- ఇలాంటి ప్రదేశంలో కూర్చొని నువ్వు చేస్తున్న పనేమిటి? అడవికి పోయి కట్టెలు కొడతావా? " అని.

అవ్వ కోపంతో ఊగిపోయింది. "కాదు నాయనా, కాదు! నా ప్రయత్నం కట్టెపుల్లల కోసం కాదు! నా కొడుకులందరినీ పొట్టన పెట్టుకొన్న రాక్షసుడు- ఆ అశోకుణ్ణి రేపటి యుద్ధంలో హతమార్చనున్నాను నేను. నాతో పాటు నాలాంటి వేలాది తల్లుల ఉసురు పోసుకున్న ఆ దుర్మార్గుడు ఊరికే చావడు! ఈ గొడ్డలికి ఎంత పదును పెడతానంటే, దీనితో ఒక్క వేటుకు వాడి తల తెగి పడాలి!" అని అరిచింది.

ఆవిడ క్రోధాన్ని చూసి అశోకుడి గుండెలోంచి

శోకం తన్నుకొచ్చింది. ఇంతమంది తల్లులకు గర్భశోకం కల్గించిన తను నిజంగా శిక్షకు పాత్రుడే అనిపించింది. కొంచెం సేపు అతని నోట మాట రాలేదు. తరువాత అన్నాడు "అశోకుడు మగధ సామ్రాట్టూ, మహాయోధుడున్నూ. ముసలి దానివి, నువ్వు వాడిని ఏం చేస్తావు?" అని.

అవ్వ నవ్వింది- ఆ నవ్వులోని శోకం అశోకుడి హృదయాన్ని పిప్పి పిప్పి చేసింది- "కళింగ స్త్రీల శౌర్యం నీకు తెలీదల్లేఉంది నాయనా! మూడు కాళ్ల ముసలిదైనా పగవాడిని మూడు చెరువుల నీళ్లు త్రాగించగలదు. అశోకుడు గెలిచే కళింగలో నరపురుగు అన్నదే ఉండదు చూస్తుండు!" స్థిరంగా పలికింది అవ్వ.

అశోకుడి కన్నీరు కాల్వలైంది. "అవ్వా! నువ్వన్నట్టు ఆ దుర్మార్గుడు రాక్షసుడే! వాడికి ఏ శిక్ష విధించినా చాలదు. వాడి పాపానికి వేరే నిష్కృతి లేదు" అన్నాడు దగ్గుత్తికతో.

"రేపు రానివ్వు వాడిని! కనిపించగానే వాడిని ఎలా యీ గొడ్డలికి బలి చేస్తానో చూడు" ఆవేశంతో ఊగిపోయింది అవ్వ.

అశోకుడు ఒక నిర్ణయానికి వచ్చాడు. అన్నాడు- "అవ్వా! ఒక్క క్షణం ఆలోచించు. నువ్వు ఆ అశోకుడి ప్రాణాలు తీస్తే ఆ క్షణంలోనే నీ ఆగ్రహం చల్లారి పోతుంది; వాడికి ఇక మరే బాధా ఉండదు. అట్లా కాకూడదు. వాడు బ్రతికే ఉండాలి- బ్రతికి ఉన్నన్ని రోజులూ వాడు నేలమీద పొర్లాడుతూ చిత్రహింసను అనుభవించే మార్గం చూడు. అట్లా జరిగితే తప్ప వాడి ఈ పాపాగ్ని చల్లారదు" అన్నాడు అశోకుడు.

"అయితే వాడి కాళ్లు నరుకుతాను. అటు ప్రాణాలూ పోక, ఇటు కాళ్ళూ లేక వాడు చిత్రహింసలు అనుభవించాలి!" కసిగా అంది అవ్వ.

అశోకుడు తలవంచుకొని నిలబడ్డాడు- "అవ్వా! ఆ కసాయి అశోకుడు వీడే! ఇదిగో, ఇక్కడే- నీ కళ్ల ముందు ఉన్నాడు. తెగనరుకు, వాడి కాళ్ళు!" అన్నాడు నెమ్మదిగా.

అవ్వ తలెత్తి చూసింది. మాసిన వస్త్రాలతో, ఎర్రని తలపాగాతో కన్నీళ్లు కార్చుతూ దీనంగా

నిలబడ్డ అశోకుడు కనిపించాడు.

చాలాసేపటివరకూ ఆ అవ్వ ఏమీ మాట్లాడలేదు. తర్వాత అన్నది- "నువ్వు చేసినది మామూలు తప్పు కాదు. రాజ్య కాంక్షతో ఇంతమందిని బలి తీసుకున్నావు. నిజంగానే నీకు ఏ శిక్ష వేసినా చాలదు. అయితే నువ్వు ఈనాడు నిజంగా పశ్చాత్తాపంతో పరితపిస్తున్నావని అర్థమైంది నాకు. పశ్చాత్తప్తులను శిక్షించరాదు.



నువ్వు కూడా నా కుమారులవంటివాడివే- ఏమంటే, నా కుమారులు దేశంకోసం వీరమరణం చెందారు; నువ్వు వాళ్లందరి ఉసురూ పోసుకొని హంతకుడివైనావు. అయినా పశ్చాత్తాపం చెందిన నిన్ను నేను ఏమీ చెయ్యను. పో, ఇక్కడినుండి" అని కన్నీళ్ళపాలైంది.

"అవ్వా! నా కాళ్లు నరికి నా అహంకారాన్ని పటాపంచలు చెయ్యి. లేదంటే నా పాపానికి నిష్కృతి లేదు" అశోకుడు ఆమె పాదాలపై పడ్డాడు. దు:ఖంతో అతని గొంతు పూడిపోయింది.

"నాయనా! లే! పో! ధర్మాన్ని రక్షించు. అశాశ్వతమైన భోగ భాగ్యాలకోసం వెంపర్లాడకు. సంపద తృణప్రాయం. దానిమీద మోహాన్ని వదిలిపెట్టు. ప్రాణికోటికి శాంతినిచ్చే పనులు చేపట్టు. బాటలకు ఇరువైపులా చెట్లు నాటించు. వైద్యశాలలు నిర్మించు. ప్రజలకు కడుపునిండా కూడు పెట్టు. ఎందరు స్త్రీలు భర్తల కోసం, ఇంకెందరు బిడ్డలు తండ్రుల కోసం, ఎందరు తల్లులు బిడ్డల కోసం దు:ఖిస్తున్నారో తలచుకో. ప్రాణి హింస విడనాడు. ముందుకు సాగిపో" అంటూ దారి చూపింది అవ్వ.

అశోకుడికి కర్తవ్యం తెలిసి వచ్చింది.




# వింత కుండ

*ఒరియా కథనం: గోపాల్‌చంద్రప్రహరాజ్, ఒరియా మాధ్యమం.*
*అనువాదం: సుమిత్రాదేవి, ఉపాధ్యాయిని, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా.*

అనగా అనగా ఒక ఊళ్ళో అట్ల పండా అనే బ్రాహ్మణుడొకడు ఉండేవాడు. అతనికి వాళ్ల అమ్మ తప్ప 'నా' అన్న వాళ్ళు ఎవ్వరూ లేరు. అట్లపండా భిక్షాటన చేసేవాడు; వాళ్ల అమ్మేమో కూలిపనికి వెళ్ళేది. దాంతోటే వాళ్ల జీవనం గడుస్తూండేది.

ఒకరోజున అట్లపండాకి ఎక్కడా ఒక్క పిడికెడు బియ్యంకూడా దొరకలేదు. అతనికి చాలా దిగులు వేసింది. "ఖాళీ చేతులతో ఇంటికి ఎట్లా వెళ్ళటం?" అని బాధ పడుతూ, రోజూ వెళ్ళే దారిలో కాకుండా మరో క్రొత్త దారిలో నడవటం మొదలు పెట్టాడు.

అతను అట్లా అడవి దారిన పోతూ ఉంటే అకస్మాత్తుగా నిర్మలమైన చెరువు ఒకటి కనిపించిందతనికి. దాన్ని చూడగానే వాడికి దాహం వేసింది. తను ఎంత అలిసిపోయాడో

కూడా గుర్తుకొచ్చింది. చటుక్కున ఆ చెరువు గట్టున కూర్చున్నాడు. చేతిలోకి ఒక్క దోసెడు నీళ్ళు తీసుకున్నాడు. పాట మొదలు పెట్టాడు- "ఇదిగో, బువ్వ తిన్నానూ.." అని ఆ నీళ్ళు త్రాగేశాడు. వెంటనే మరో దోసెడు నీళ్ళు తీసుకొని, "పాయసం త్రాగానూ.." అని వాటిని త్రాగేశాడు. అట్లాగే మళ్ళీ మళ్ళీ నీళ్ళు తీసుకుంటూ "బూరెలు ఇవిగో తింటున్నా..పప్పు నెయ్యీ తింటున్నా.."అని పాడుతూ నీళ్లతోటే కడుపు నింపుకున్నాడు.

ఆ కోనేరులో ఉన్న గంగమ్మ తల్లికి వాడిని చూస్తే జాలి వేసింది. "అయ్యో పాపం" అనుకొని, ఆ తల్లి ఒక కుండను తీసుకొని, దానిలో రుచికరమైన పదార్థాలన్నిటినీ అమర్చి, దాన్ని అట్ల పండా వైపుకు వదిలింది. దేవి మహిమతో ఆ కుండ నీళ్ళలోంచి పైకి తేలి తేలి పండా దగ్గరికి చేరింది!

అకస్మాత్తుగా దర్శనమిచ్చిన ఆ కుండను చూసి అట్లపండా ఆశ్చర్యపోయాడు. ఆ కుండను పట్టుకొని ఒడ్డు చేరుకున్నాడు; మూత తీసి చూసి ఆశ్చర్యపోయాడు. అందులో ఉన్న మిఠాయిలన్నిటినీ చూడగానే అతనికి నోట్లో నీరు ఊరింది. కోనేరు ప్రక్కనే ఉన్న అరటి చెట్టునుండి ఆకొకటి తెచ్చుకొని, కుండలో ఉన్న భక్ష్యాలన్నిటినీ కడుపునిండా తిన్నాడు. చూస్తే కుండలో ఇంకా చాలా పదార్థాలు మిగిలే ఉన్నాయి! "అమ్మకి పాపం, ఇవంటే ఎంత ఇష్టమో" అని, వాడు సంతోషంగా ఆ కుండను పట్టుకొని ఇంటికి పరుగుతీసాడు.

కుండ చలవ వల్ల తల్లీ కొడుకు లిద్దరికీ ఆరోజు కడుపునిండా తిండి దొరికింది. రోజూ తెలవారకనే పనికి వెళ్ళే తల్లి, మరునాడు పనికి పోనేలేదు! అట్లపండాని పిలిచి అన్నది-"ఒరే, మన కష్టాలు ఇక తీరినట్లే, నేను ఇక పనికి పోను. నువ్వు వేరే ఎక్కడా అడుక్కోనవసరం లేదు. రోజూ కోనేరు దగ్గరికే వెళ్ళు నాయనా" అని. అట్ల పండాకు కూడా ఆ సలహా నచ్చింది. సరేనని వాడు ఊరంతా తిరిగి అడుక్కోవటం మానేసి, రోజూ కులాసాగా నడచుకుంటూ కోనేరు దగ్గరికే వెళ్ళి రావటం మొదలు పెట్టాడు. కోనేరు చేరుకోగానే తను అంతకు ముందు

అన్న మాటల్నే మంత్రం లాగా చదివేసి పది దోసిళ్ల నీరు త్రాగేవాడు వాడు. గంగమ్మ తల్లి జాలిపడి, ఒక కుండనిండా తినే పదార్థాలను పంపించేది. ఇక తల్లీ కొడుకులకి పని చెయ్యవలసిన అవసరమే లేకుండా పోయింది. కుండలోని రుచికరమైన ఆహారం తినీ తినీ అట్లపండాకు బొజ్జ పెరగటం కూడా మొదలైంది!

కొన్ని రోజులు ఇట్లా గడిసాక, గంగమ్మ తల్లికి అర్థమైంది- తన దయ కారణంగా తల్లీ కొడుకులిద్దరూ సోంబేరులవుతున్నారు! "ఇట్లా అయితే ఎలాగ, గుణపాఠం నేర్పాల్సిందే" అనుకున్నది ఆ తల్లి. మరునాడే గంగమ్మ కుండనిండా రకరకాల దెబ్బల్ని నింపి పెట్టింది- ముష్టిఘాతాలు, లెంపకాయలు, గుద్దులు, తొడపాశాలు- ఇలాంటివన్నమాట. రోజూలాగానే ఆ కుండ తేలుకుంటూ అట్లపండా దగ్గరికి వచ్చింది. వాడు గబగబా దాన్ని అందుకొని ఒడ్డెక్కి, సిద్ధంగా ఉంచుకున్న అరటి ఆకును తన ముందు పరచుకొని, కుండకున్న మూతను తీసాడు- వెంటనే వాడిపైన దెబ్బల వర్షం కురిసింది. "ఓలెమ్మో, ఓరి నాయనో" అని కేకలు పెట్టుకుంటూ కోనేరు చుట్టూ పరుగులు పెట్టాడు వాడు. అయితే దెబ్బలు వాడిని వదిలితేగా..? వాడు ఎటు వెళ్తే అటు వెంబడించాయి అవి. చివరికి వాడి మెదడు పనిచెయ్యటం మొదలు పెట్టింది- పరుగు పరుగున కుండ దగ్గరికి చేరుకొని, వాడు దాని మూత మూసేయగానే ఒక్క క్షణంలో దెబ్బలన్నీ మాయమైపోయాయి!

అట్ల పండా నిశ్శబ్దంగా అక్కడే కూర్చొని ఆలోచించాడు- "ఇట్లా ఎందుకు జరిగింది?" అని. తను చేసిన తప్పేంటో అర్థమైంది వాడికి. వాడు లేచి గంగమ్మ తల్లికి నమస్కరించుకొని, "ఇకమీద నేను నీ దగ్గరికి రాను తల్లీ, బుద్ధి వచ్చింది. ఏదో ఒక పనిచేసుకొని బ్రతుకుతాను" అని, కుండను పట్టుకొని ఇల్లు చేరుకున్నాడు.

ఆసరికి ఖాళీగా ఊరంతా తిరిగి వచ్చింది వాళ్లమ్మ. అట్లపండా కుండను అక్కడ పెట్టి కాళ్ళు కడుక్కొని వచ్చేసరికి, ఆమె దాని

మూత తీసి "ఈరోజు ఏమున్నాయి?" అని చూడనే చూసింది. ఇంకేముంది, ఆమె మీదకూడా దెబ్బల వర్షం మొదలు! ఎవరో కొట్టినట్లు, గుద్దినట్లు, గిచ్చినట్లు, రక్కినట్లు- ఆమె కేకలు వేసుకుంటూ ఇల్లంతా గుండ్రగా పరుగెత్తింది. ఆమె కేకలు విని అట్ల పండా లోపలికి పరుగెత్తుకు వచ్చి కుండమీద మూత పెట్టేసరికి ఆమె ఒళ్ళు హూనం అవ్వనే అయ్యింది!

"అబ్బా! అయ్యో! అమ్మో!" అనుకుంటూ ముసలమ్మ అక్కడే, చేరగిలపడింది, కుండకేసి భయం భయంగా చూస్తూ. "ఇకమీద మనం ఏదో ఒక పనిచేసుకొని మర్యాదగా బ్రతుకుదాం అమ్మా! ఈ అడుక్కు తినేది వద్దు. ఈ కుండని ఎక్కడైనా ఎవ్వరికీ అందని చోట పెట్టిరా" అన్నాడు అట్లపండా ఆమెతో. ఆమె భయం భయంగానే ఆ కుండని పట్టుకెళ్ళి, పెరట్లో ఉన్న దిబ్బలో దాన్ని పడేసి, చేతులు దులుపుకున్నది- "సరేలేరా, మన రాత అంతే!" అంటూ.

అయితే ఏమైందంటే, ఆరోజు రాత్రి దివాణంలో దొంగలు పడ్డారు. రాజుగారికి పన్ను చెల్లించేందుకుగాను గ్రామపెద్ద సేకరించిన డబ్బంతా దొంగల పాలైంది.

ఆ నలుగురు దొంగలూ ఒక పెద్ద పెట్టెనిండా బంగారు నగలు, ఆభరణాలు అన్నీ మోసుకొచ్చుకొని, అట్లపండా ఇంటి పెరడును చేరుకున్నారు.



"వీటిని వంతులు వేసుకుందాంరా" అన్నాడు వాళ్ళలో ఒకడు. అందరూ సరేనని, అటూ ఇటూ చూస్తే, మొత్తం నిశ్శబ్దంగా ఉంది.

"సరే, ఇక్కడే కూర్చుందాం, ఏమౌతుంది?" అని వాళ్ళు పెట్టెను అక్కడే దించి, బట్ట పరచుకొని కూర్చున్నారు. దిబ్బలో ఉన్న కొత్త కుండ వాళ్ల కంట పడనే పడింది:

"ఒరే, ఈ కుండ బాగుంది, అందులో ఏముందో చూద్దాం" అని వాళ్ళు దాని మూత తెరిచేసరికి ఏముంది, గుద్దుల వర్షం మొదలైపోయింది.



దొంగలు నలుగురూ "ఆలో లక్ష్మణా" అంటూ కాళ్లకు బుద్ధి చెప్పారు.

కొద్ది సేపటికి లేచి వచ్చిన అట్లపండా, వాళ్ల అమ్మ తమ దిబ్బమీద పెట్టిఉన్న పెట్టెను చూసి నిర్ఘాంతపోయారు. దాని మూత తీసి చూసాక తల్లీ కొడుకులిద్దరికీ నోట మాటరాలేదు. వాళ్ళిద్దరూ కలిసి పెట్టెని ఇంట్లోకి మోసుకెళ్ళారు. అయితే, వాళ్ళిద్దరికీ ఆసరికే జ్ఞానోదయం అయి ఉన్నది కదా, అందుకని వాళ్ళు ఆ నగల పెట్టెని సొంతం చేసుకునే సాహసం చెయ్యలేదు. తెల్లవారగానే ఆ నగల పెట్టెను గ్రామపెద్దకు అప్పగించారు.

"దొంగలు ఉమ్మడి ఆస్తినే ఎత్తుకెళ్ళారే, ఎలాగ?" అని తలపట్టుకొని కూర్చున్న గ్రామపెద్దకి అట్లపండా దేవుడల్లే కనిపించాడు.

ఆయన వాడిని పొగిడి, వాడి నిజాయితీని మెచ్చుకొని, వాడికి ఓ చిన్నపాటి సన్మానం చెయ్యటమే కాక, గ్రామ పంచాయితీలో ఒక ఉద్యోగం కూడా ఇచ్చాడు! దాంతో తల్లీ కొడుకుల పేదరికమూ పోయింది; వాళ్లకు మంచిరోజులొచ్చాయి!

# పదరంగం-16

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ పోస్టు కార్డులో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-17 తోపాటు ప్రచురించగలం. నిర్వహణ: దేవి, బెంగుళూరు.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | 4 | 5 |
| 6 | | | | 7 | |
| 8 | | | 9 | | |
| | | 10 | | 11 | |
| 12 | | | 13 | | |
| | | 14 | | | |

**అడ్డం:**

1. ప్రతి ఇంటికీ ముందు ఉండేది (3)
4. ఇదివరకు నాణేన్ని ఇలా పిలిచేవాళ్ళు (2)
6. చిన్న నాటకం (3)
7. పాడి కాదు! (2)
8. కాకి ని పిలు! (2)
10. తోటకి కాపలాదారు (4)
12. దీంతో వాసన చూస్తాం (2)
13. ఒక నాలుగు చక్రాల వాహనం (2)
14. కాకతీయుల రాజధాని (4)

**ఆధారాలు**

**నిలువు:**

1. ఎండాకాలం తర్వాత వచ్చేది (5)
2. ఇది తెరిస్తే గాలీ వెల్తురూ వస్తాయి (3)
3. ఆకలి,రోకలి లలో ఉన్నది తిరగబడితే? (2)
4. కోత కాదు- కాయటాన్నే రైతులు ఇట్లా అంటారు (2)
5. గుండ్రంగా తిరిగే గాలి (4)
9. వంటింట్లో ఉండే కారు కాని కారు (4)
11. ఒక దీర్ఘం పోయిన మారుగా (3)

పదరంగం 15 కు సరైన జవాబు →

| | | | | | |
|---|---|---|---|---|---|
| | 1 చై | 2 నా | | 3 జ | గం |
| 4 చి | త్ర | శే | 5 ఖ | నం | |
| | మా | | ఢం | | 6 వె |
| 7 వ | సం | 8 తం | | 9 లా | ల |
| ను | | 10 గ | 11 ర | ళం | |
| 12 న | గం | | 13 న | క | లం |

ఈసారి సరైన సమాధానం రాసిన వాళ్ళు ఇద్దరే:

1. ఏ యస్ నందన, నాలుగో తరగతి, ప్రకృతిబడి.
2. జి.సత్యలక్ష్మి, రెండో తరగతి, ఇంటిబడి.

# తెలుగు పూల జల్లు

*రచన: మహేంద్రాడ సింహాచలాచార్య (స్కూల్ అసిస్టెంట్ తెలుగు), ప్ర.ఉ.పా, టెక్కలి.*
*గానం: గౌతం, హేమలత, ఊర్వశీప్రసాద్, విజయలక్ష్మి, హేమసుందర్, వరప్రసాద్, పవన్‌కల్యాణ్, ఉపేంద్ర.*

తెలుగులోని తియ్యదనం
తెలుగు నేల సనాతనం
తేట తెనుగు మనకు వరం
తెలుగే మన మూల ధనం

తెలుగు భాష మనకు శ్వాస
తెలుగు మాట మణి పూస
తెలుగు వెలుగు మనకు రక్ష
తెలుగే పెదబాలశిక్ష

తెలుగు తల్లి కల్పవల్లి
తెలుగు మనకి అమృత వల్లి
తెలుగు భాష పూల జల్లు
తెలుగే ఒక హరివిల్లు

తొలి కవి 'నన్నయ్య' తెలుగు
'అన్నమయ్య' పాట తెలుగు
'వేమన' పద్యం తెలుగు
'ఎంకి' పాటె అచ్చ తెనుగు

'విశ్వనాధ' కవిత తెనుగు
'కందుకూరి' చేవ తెలుగు
'గురజాడ' ముత్యాల తెలుగు
'శ్రీశ్రీ' భావాగ్ని తెలుగు

యుగ యుగాల తెలుగు నింపు
తెలుగు మాటలెల్ల కలుపు
అమృత భాష మన తెలుగు
తెలుగే మన కాది వెలుగు

తేనె తెలుగు పలుకరింపు
తెలుగు నుడల పోహళింపు
తెలుగు జగతి వెలుగు నింపు
తెలుగే మన కీర్తి నిలుపు

# పిచుకమ్మా!

*రచన:పి.ఎస్.నాగరాజు, ఉపాధ్యాయుడు, ప్రభుత్వఉన్నతపాఠశాల, టెక్కలి.*
*గానం: ఊర్వశీప్రధాన్, శృతి, వరప్రసాద్, ఉపేంద్ర, 8 వతరగతి.*

పిచుకమ్మా! పిచుకమ్మా!
నీ గూడెక్కడ చెప్పమ్మా?
అవ్వ చెప్పిన కథలో
ఆ పొరుగు కాకి ఏదమ్మా?

పచ్చదనం కరిగిపోయి - చెట్టునీడ కనుమరుగై
ఈ కాంక్రీటు జనారణ్యం - జంతు నీతి సమాజాన

పంట పొలం బీడైతే - పరిగ గింజ కరువైతే
వరికంకుల కుచ్చులున్న - చూరులన్ని నిండుకుంటే "పిచుకమ్మా"

రెండు చేతుల జాతి - వేల వేల చేతులు చాచి
పర్యావరణ సమతుల్యాన్నే - కకా వికలు చేస్తుంటే "పిచుకమ్మా"

సొంతలాభం మూర్ఖత్వం - భూమినంతా కబళిస్తే
పురుగూ పిట్టా చెట్టూ పుట్టా - ఉనికి మనకి పోతుంటే "పిచుకమ్మా"

# పిల్లలం

*రచన:పి.నాగభూషణరావు, 7 వ తరగతి, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*
*గానం: హేమలత, విజయలక్ష్మి, ఉపేంద్ర, హేమసుందర్.*

పిల్లలం- చిన్నపిల్లలం
పిల్లలం- పసి పిల్లలం

చక చక బడికి వచ్చేస్తాం
ఆటలు ఎన్నో ఆడేస్తాం "పిల్లలం"
పాటలు ఎన్నో పాడేస్తాం
ప్రకృతి ఒడిలో శాస్త్రవేత్తలం "పిల్లలం"

గురువులు చెప్పిన పాఠం వింటాం
పెద్దలు చెప్పిన మాటలు అంటాం "పిల్లలం"

పుస్తకాలు ఎన్నో చదివేస్తాం
పాఠాలెన్నో నేర్చేస్తాం "పిల్లలం"
నిజాలు మేమే చెప్పేస్తాం
ఎక్కడ చూసిన అక్కడ మేమే! "పిల్లలం"

పద్యాలెన్నో నేర్చేస్తాం
నీతులు ఎన్నో పాటిస్తాం "పిల్లలం"
చకచక రాతలు రాసేస్తాం
గడ గడ చదువు చదివేస్తాం "పిల్లలం"

మట్టిని పిసికి మెత్తగ చేసి
బొమ్మలు ఎన్నో చేసేస్తాం "పిల్లలం"
ఇసకతో ఇళ్ళు కట్టేస్తాం
కాగితాలతో పువ్వులు చేస్తాం "పిల్లలం"

అందరమొకటై నిలబడతాం
ఫలితాలెన్నో సాధిస్తాం "పిల్లలం"

# బడికి పోదాం!

*రచన: పి.ఎస్.నాగరాజు, ఉపాధ్యాయుడు, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.*
*గానం: హేమలత, ఊర్వశీప్రధాన్, విజయలక్ష్మి, హేమసుందర్, వరప్రసాద్, పవన్‌కల్యాణ్, ఉపేంద్ర,*

కలసి సాగుదాం - బడికి కదులుదాం
అలుపు సొలుపు మరచిపోయి
నడచి సాగుదాం!

కొండవాగు ఉరకలెత్తు మా అడుగులో
గుండె ఊసులెన్నో పొంగు ఈ బాటలో
కలసి పాడుదాం-బడికి సాగుదాం
చెట్టపట్ట జట్టుకట్టి - కదలిసాగుదాం

తెలుగు పూలు రేకులెత్తి పరిమళించగా
వెలుగు బాట వికసించే పదం పాడుదాం
కలసి పాడుదాం-బడికి సాగుదాం
గట్టుపుట్ట మెట్టదాటి కదలిసాగుదాం

కలం యోధులెందరినో తలచుకొందము
విజ్ఞాన శాస్త్రవేత్తలను తెలుసుకొందము
తలపు పెంచుదాం - కలుపు తుంచుదాం
వెలుగు నీడ రాపిడిలో విలువ పెంచుదాం

చిత్తు శుద్ధి, నమ్రతా వదిలిపెట్టము
నిరంతరం శ్రమచేస్తాం - బద్ధకించము
మాట తప్పము - తప్పి నడవము
బాటతప్పి బూకరిస్తె వదిలిపెట్టము

అడ్డమయిన బండరాయి మెట్టుచేసుకొని
ఎగుడుమెట్ల కుట్రల్ని రచ్చకీడ్చుదాం
చిన్న వాళ్ళందరికీ ఊతమిద్దము
చిన్న చిన్న అడుగులతో ముందుకెళ్దాము.

కదలి సాగుదాం - బడికి కదులుదాం
చదువు సారమెరిగి
బతుకు వెతలు చెరుపుదాం.

# సమీక్ష

*కొత్తపల్లి పత్రిక మే 2012 సంచికపై ఒక సమీక్ష..*
*నిర్వహణ: శ్రీమతి మాలతీకృష్ణ, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*




కొత్తపల్లి పుస్తకం చేతికి రాగానే మొట్టమొదట చదివేది సంపాదకీయాన్నే. కొన్నిసార్లు అది ఉన్నతంగా నిలబడ్డా, మరికొన్ని సార్లు నిరాశ పరుస్తుంటుంది- ఇదిగో, ఈ సారిలాగా. ఈసారి సంపాదకీయం చాలా క్లిష్టంగా ఉంది. "ఇదంతా ఏంటి, దేనికి చెబుతున్నారు?" అనేది అర్థం కావటానికి ఆ విషయం మీద లోతైన అవగాహన ఉంటే తప్ప సాధ్యం కాదు అనిపించింది. పెద్దవాళ్ళకి సైతం అది ఓ పట్టాన మింగుడు పడలేదు. నీలపు నీటిచుక్క కథకీ,కార్మిక దినోత్సవానికీ మధ్య సంబంధంపిల్లలకి నిజంగా అర్థం కాదు. చదివిన పిల్లలు స్ఫూర్తి పొందాలంటే వారికి విషయ పరిజ్ఞానం అవసరం. 'ఇంత గందరగోళంగా కాకుండా సరళంగా, తిన్నగా ఆ రోజు యొక్క విశిష్టతనీ, దాని చరిత్రనీ వివరించి ఉంటే బాగుండేది' అనిపించింది. మా అభిమాన సంపాదకీయం మరింత స్ఫూర్తిదాయకంగా పిల్లలకు దగ్గరవ్వాలని మా కోరిక.

సంపాదకీయం కలిగించిన నిరాశనంతా పిల్లల కథలు తుడిచి పెట్టేశాయి. దాదాపుగా అన్నీ -"ఇవి నిజంగా పిల్లల కథలే- విషయం, కథ, అల్లిక, అన్నీ ఆ వాసనల్నే గుబాళిస్తున్నాయి" అనిపించేట్టుగా ఉన్నాయి.

* 'గొప్పలు చెప్పకు' వ్రాసిన ముగ్గురమ్మాయిలూ భలే క్రొత్త ఐడియాతో వ్రాసారు కథని. చిన్నదైనా ఎంత చక్కగా ఉందో, కథ!

*కాశ్యప్ వ్రాసిన కథలో ముగ్గురి మిత్రుల తెలివితేటలూ మరీ ఎక్కువగా ఉన్నాయనిపించినా, తను వివరించిన విధానం చాలా బాగుంది.

*కాలం విలువ కథలోని ఇన్స్పెక్టరు బొమ్మలో డాక్టరుగా అవతరించాడు!

*అమ్మమ్మ ఊరి గురించి ప్రవీణ ఎంత ఊరించి చెప్పింది! అది కథ కాదనే అనిపించలేదు అసలు.

*కుమారి వ్రాసిన 'సూరితోట" లాంటివి కల్పించటం సరదాగా ఉంటుంది- పెద్ద కష్టం కూడా కాదు!

ఇక బొమ్మకి కథల కోసం ప్రత్యేకంగా ఓ పుస్తకమే వెయ్యాలేమో! ఒకదానికొకటి సంబంధం లేకుండా వైవిధ్యంతో ఉన్నాయి కథలు. 'గోపి కల' ఒక వెరైటీ ఆలోచన. 'తిరిగి కలిపిన బొమ్మ' సినిమా లెవెల్లో ఉంది. వికాస విద్యావనం పిల్లల పేరుతోబాటు రోల్‌నంబర్లు కూడా వ్రాయటం నవ్వు తెప్పించింది. చిన్నప్పుడు ఎవరైనా ఏం చదువుతున్నావని అడగటం ఆలస్యం- "మాలతి, రోల్ నంబరు 24, మూడో తరగతి" అని చెప్పకపోతే తృప్తి కలిగేది కాదు నాకున్నూ!

'ఒక పిల్లి స్వగతాన్ని' చాలా ఎంజాయ్ చేశాం, అందరం. ముగింపు మరీ బాగుంది.

భయం-భక్తి కథలో లాగా, మనకు భక్తికంటే భయమే ఎక్కువన్నది పచ్చి నిజం. దేవుడంటే ఉన్న భక్తి వల్ల కలిగే నమ్మకం, దెయ్యమంటే కలిగే భయాన్ని పోగొట్టటంలో ఓడిపోతుందన్నది చాలామంది దగ్గర తెలుసుకున్న విషయం. నమ్మకాన్ని భయం జయించటం ఎప్పుడూ దురదృష్టకరమే.

మూర్తిగారి చిలిపి ప్రశ్నలలో మూడోది చాలా బాగుంది.

యోకేశ్వరన్ పరిచయం చాలా స్ఫూర్తిదాయకంగా ఉంది. పిల్లలు వాళ్ల పరిసరాలను గమనించటం, వాటి గురించి ఆలోచించటం ఎంతో అవసరం. -మీకూ ఇలాగే అనిపించిందా?

**ముద్రిత ప్రతుల వెల:** ప్రతి ఒక్కింటికి: 20 రూ.
12 పుస్తకాలకై చందా: 240 రూ.

“కొత్తపల్లి ట్రస్టు” పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.

బ్యాంకు అక్కౌంటు వివరాలు:
“Kottapalli Trust”, A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు
సంపాదకత్వం: నారాయణ
వెబ్సైటు, సాంకేతికత: ఆనంద్, లక్ష్మి
ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు
ముఖచిత్రం 'టెక్కలి బడి': వీరాంజి
చిత్రాలు: శ్రీ డబ్బీరు ధర్మారావు, శ్రీ వి. అప్పల నాయుడుగారు, యం ఉపేంద్ర, సోమేశ్వరరావు, శాతవాహన, చందు, టెక్కలి.
కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:** పట్టు విడవకుండా కావలసిన అంశాలన్నీ సేకరించి పెట్టి ఈ సంచిక విడుదలయ్యేందుకు కారణభూతులైన శ్రీ పి.యస్.నాగరాజుగారికి, టెక్కలి ప్రభుత్వోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ రాజేశ్వరరావు ఆచారి గారికి, అధ్యాపక వర్గానికి, ఈ సంచికకు రంగుల చిత్రాలనందించిన శ్రీ డబ్బీరు ధర్మారావు, శ్రీ వి.అప్పలనాయుడు గార్లకు, బాల చిత్రకారులు ఉపేంద్ర, సోమేశ్వరరావు, శాతవాహన, చందూ చరణ్‌లకు, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచి పుస్తకం:

## మరపురాని గురుజాడలు

ఓ బడికి నూటయాభై ఏళ్ళు-

దానిలో కొన్ని వేలమంది చదువుకొని ఉంటారు.  కొన్ని వందలమంది పాఠాలు చెప్పి ఉంటారు. అందరూ వాళ్ల బడి గురించి ఏదో ఒక ముచ్చట చెబుదామనుకుంటారు.  వాళ్ల బడిలో వాళ్లకు నచ్చినవేవో చెబుతారు; వేరే బడులు ఎలా ఉంటే బాగుంటాయో చెబుతారు.  వాళ్ళకు పాఠాలు చెప్పిన మంచి టీచర్ల గురించి చెబుతారు.  వాళ్ళు తమ జీవితాలని ఎలా మలచిందీ చెబుతారు.

ఆ అనుభవాలు చదివాక, మన బడి ఎలా ఉందో ఆలోచించుకోవచ్చు.  మనకు పాఠాలు చెప్పిన వాళ్ళు ఎలా ఉన్నారో చూసుకోవచ్చు.

అట్లా ఉపయోగపడే చిన్ని పుస్తకాన్ని ప్రచురించారు, టెక్కలి ప్రభుత్వ ఉన్నత పాఠశాల వారు.  ఆ బడి మొదలై నూటయాభై ఏళ్లయిన సందర్భంగా వెలువరిస్తున్న ఈ పుస్తకం, బడుల గురించి ఆలోచించమని అందరికీ చెబుతుంది.




**మరపురాని గురుజాడలు**

ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి.

పేజీలు: 92, వెల: రూ.30

ప్రతులకు:

శ్రీ పి.యస్. నాగరాజు

9441913829



## ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి- ఒక పరిచయం

*ఒఢ్ర రాజులు (గజపతులు) శ్రీ లక్ష్మీనారాయణ జగద్దేవ్ గారి కాలంలో- అంటే క్రీ.శ.1861 లో- ప్రాథమిక పాఠశాలగా ప్రారంభించబడింది. రాజా మధుసూదనదేవ్ గారి కాలంలో ఉన్నత పాఠశాలగా మారింది. ప్రస్తుతం ఈ మహారాజావారికి 93 ఏళ్ళు. ఒరిస్సాలోని బరంపురం లో నివాసం ఉంటున్నారు. బరంపురంలో పేరుపొందిన 'లింగరాజు లా కాలేజ్' వ్యవస్థాపకులు కూడా వీరే.

* రొక్కం లక్ష్మీనరసింహ దొర- శాసన సభ్యునిగా రెండుసార్లు టెక్కలి నియోజకవర్గం నుండి ఎన్నికయ్యారు; ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకరు గా పనిచేసిన ప్రముఖులు. ఈ పాఠశాలకు మౌలిక వసతులను సమకూర్చటంలో విశేష కృషి సలిపారు. వీరి హయాంలో పాఠశాల బోర్డు స్కూలు అయ్యింది.

* ప్రధానోపాధ్యాయులు శ్రీ యల్లాపంతుల కృష్ణమూర్తిగారు ఈ పాఠశాలకు ఆత్మగౌరవాన్ని ఆభరణంగా అందించిన నియమ నిబంధనల తలమానికం. వీరి హయాంలో విదేశీయులు పాఠశాలను సందర్శించేందుకు ప్రత్యేకంగా వచ్చేవారు.

* ఆచార్య రోణంకి అప్పలస్వామి: ఆధునిక ఆంధ్ర సాహిత్య చరిత్ర విస్మరింపజాలని కవి పండితుడు- ఈ బడిలోనే చదువుకున్నారు. టెక్కలి పాఠశాలకు మేథో వర్గాలలో స్థానం కల్పించిన ఉన్నత వ్యక్తి-

"దేశం గడప దాటకుండా 14 యూరోపియన్ భాషలు మీరెలా నేర్చుకున్నారు?" అని అడిగితే-

"మా నాన్నగారు నాకు తెలుగు అంత బాగా నేర్పారు గనుక!" అని చెప్పిన పదహారణాల తెలుగు 'వాడి' రోణంకి.

*మంత్రి ప్రగడ శేషగిరి రావు గారు- టెక్కలి ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులు. ఒకనాడు 'ఇంగ్లీషు గ్రామర్ చెబితే ఆయనే చెప్పాలి' అని విద్యార్థులు తపన పడేవారు. రాష్ట్ర పోలీసు ఉన్నతాధికారి సత్తారు ఉమాపతి, విద్యుత్ ట్రాన్స్కో ఇంజనీరు వట్టికూళ్ళ సూర్యనారాయణ, పలాసలో డాక్టరుగారు విజయకుమార్, జిల్లా పంచాయతీ అధికారి-గజల్ గాయకుడు ప్రధాన ఆదినారాయణ, ఒకప్పటి టెక్కలి యంయల్ఏ హనుమంతు అప్పయ్యదొర, మాజీ శాసన సభ్యులు సత్తారు లోకనాథం- వీరంతా టెక్కలి పాఠశాల విద్యార్థులే; శేషగిరిరావు మాస్టారి శిష్యులే.

* హనుమంతు వీరన్న: సెలవురోజులనికూడా బడిపిల్లలతో గడిపే పిల్లల అభిమాన మాస్టారు. 1979 లో నాటి భారత రాష్ట్రపతి చేతుల మీదుగా జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహించారు.

* తెన్నేటి సత్యనారాయణ: ఏభై సంవత్సరాలు పనిచేసిన ఉపాధ్యాయులు. ప్రధానోపాధ్యాయులుగా రిటైరైనా, ఇంటివద్దనే పిల్లలకు ఆంధ్రా మెట్రిక్ పరీక్షలకు సిద్ధం చేయించిన మేటి.

*జంధ్యాల లక్ష్మీనారాయణ: మూడు దశాబ్దాల ఉపాధ్యాయులు- పాత్రికేయులు- స్వాతంత్ర్య సమర యోధులు.

*ఆట్ల అప్పల రామయ్య: ప్రజాపోరాటాలకు జీవితాన్ని, జీతాన్నికూడా ఖర్చు చేసిన ఉపాధ్యాయుడు

* భారత రాష్ట్రపతి శ్రీ వి.వి.గిరి ఈ పాఠశాల విద్యార్థే.

* మాజీ డిజిపి హెచ్.జె.దొర, డా. కిల్లి రామమోహన రావులు ఈ పాఠశాల విద్యార్థులే.

ఇంకా ఎంతమందిని సామాజిక శక్తులుగా మలచిందో, ఈ బడి!